# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధముల శాఖ : ఆంధ్ర ప్రదేశ్.

Registered No. H-373.

సంపుటి 2 | ఆగష్టు, 1958—శ్రావణము, శాలివాహనశకము-1880 | సంచిక 10

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖవారిచే ప్రచురింపబడినది.



రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి 23-7-58 న గ్రీన్‌లాండ్సులో ట్రినిడాడ్ వ్యవసాయ, భూమి, మత్స్యసంపద శాఖామంత్రి మిస్టర్ కమాలుద్దీన్ మహమ్మద్, కార్మిక, సహకారాభివృద్ధి శాఖామంత్రి మిస్టర్ డి. జి. గ్రాండోలకు తేనీటివిందు చేశారు.



రాష్ట్ర పరిశ్రమల శాఖామంత్రి శ్రీ ఎ. భగవంతరావు, 31-7-58 న హైదరాబాదులో చర్మకార పరిశ్రమపై తొలి అఖిలభారత గోష్ఠిని ప్రారంభించారు. ఆ సందర్భంలో యేర్పాటయిన ప్రదర్శనను వ్యవసాయ, నీటి పారుదల శాఖా మంత్రులతో కలసి తిలకిస్తున్న మంత్రిగారిని చిత్రంలో చూడవచ్చు.



# ఆంధ్రప్రదేశ్

ఆగస్టు, 1958.

సంపుటి 2 సంచిక 10

శ్రావణము, శాలివాహనశకము - 1880

## విషయసూచిక



— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ప్రెస్‌లో ముద్రింపబడినది.

# ముఖచిత్రం



స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంలో హైదరాబాదు ఫతేమైదానంలో జరిగిన బ్రహ్మాండమైన సభలో ప్రసంగిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి.

# ఆగస్టు పదిహేను

దాశరథి, నారాయణరెడ్డి కవులు.

---

ఆగస్టు పదిహేను అరుదెంచె నోహో
మూగవడు కంఠాల మ్రోగించె నోహో — ఆగ —

తలలెత్తి దివిదాక ఎలుగెత్తు నోహో
స్వాతంత్ర్య వీరులను స్మరియించుడోహో — ఆగ —

మంచు కొండలనుండి మరి సముద్రముదాక
కంచు దివిటీలవలె కదలిరండోహో — ఆగ —

వంద యేడులక్రింద భరత దేశమునిండ
నివురుగప్పిన నిప్పు రగిలింది ఓహో — ఆగ —

ఝూన్సిలో ఒకచండి సటలెత్తి దూకంగ
పారతంత్ర్య పిశాచి ఓరయ్యో నోహో — ఆగ —

ప్రతివాడు 'తాంతియా' ప్రతిరూపమై వెలె
ప్రతినారి లక్ష్మియై ప్రజ్వరిలె నోహో — ఆగ —

బాలగంగాధరుని వజ్రకంఠమ్ములో
స్వాతంత్ర్య శంఖమ్ము స్వరమెత్తె నోహో — ఆగ —

గాంధీ మహాశయుని కనుచూపు చల్వతో
మ్రోడువారినజాతి మోసులిడెనోహో — ఆగ —

విజయుడై జవ్హరుడు ధ్వజమెత్తి నడువంగ
తెల్లవారి మొగాలు తెల్లవడెనోహో — ఆగ —

స్వాతంత్ర్య యాగమ్ము సఫలమైన దినమ్ము
ఒక దశాబ్దమునాడె వికసించెనోహో — ఆగ —

కాశ్మీరసీమనూ కన్యాకుమారినీ
విడిపోనిబంధాన ముడివేయునోహో — ఆగ —

భాషయేదైతేమి వేషమేదైతేమి
భారతీయుల ఆత్మ వేరుగాదోహో — ఆగ —

ఐకమత్య పతాక ఆడగా దివిదాక
మడమ త్రిప్పక ముందు నడువండి ఓహో — ఆగ —

చౌటి గుండెలలోన స్వర్గమ్ము పండించి
అందరికి సమముగా అందించుడోహో — ఆగ —

—:o:—

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్నమొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

భారతదేశంయొక్క

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి !

*మీ డబ్బును యీ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

***12** సంవత్సరముల నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు*

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5 000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు.

***10** సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు*

ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ కొనవచ్చు.

*పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅక్కౌంట్లు*

రూ. 25 ల నుంచి రూ. 10,000 ల వరకూ గల నిల్వలపై నూటికి 2½ వంతులచొప్పునా, రూ. 10,000 లను మించిన నిల్వలపై నూటికి 2 వంతుల చొప్పునా వడ్డీ ఇవ్వబడుతుంది.

15 సంవత్సరముల ఆన్యూయిటీ సర్టిఫికెట్లు (రెండవ సీరీస్)

జారీచేయబడు ధరలు : రూ. 3,325, రూ.6,650, రూ. 13,300 రూ. 26,600.

ఈ సొమ్ము, నూటికి సంవత్సరానికి కొంచెమెక్కువగా 4 వంతుల చొప్పున యిచ్చే చక్రవడ్డీతో సహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది.

వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకు కొనవచ్చు.

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!

## భావి భారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, యీ పెట్టుబళ్ళకి సంబంధించిన నిబంధనావళికొరకు :

నేషనల్ సేవింగ్సు కమిషనర్, నాగపూర్ చిరునామాకికాని లేక

రీజియనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు (దక్కన్)

చిరునామాకి కాని వ్రాయాలి.

గవర్నరు సందేశం

# సామర్థ్యగుణం అలవరచుకోండి

స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపుకునే మహా గౌరవం మరొకసారి మనకు లభించింది. ఈ రోజు సంతోష దాయకమైన పర్వదినమేకాదు; మృతవీరుల సంస్మరణ దినోత్సవంకూడా. స్వాతంత్ర్య మహా సంగ్రామంలో ఆత్మార్పణకు వెనుదీయక అసువు లర్పించిన వీరులందరినీ కృతజ్ఞతతో మనం సంస్మ రించుకుంటాం. కృతజ్ఞత లర్పించటం మంచిదే. కాని స్వర్గలోకంలోని మృతవీరులు కేవలం కృతజ్ఞతలతో సంతృప్తి పడరు. వారు మననుండి అంతకంటే ఎక్కువైన దానినే ఆశిస్తారని నేను భావిస్తాను. స్వాతంత్ర్య సమరంలో ఉత్సాహంతో వారిని లంఘింపజేసిన శక్తులలో, దేశానికి సౌఖ్య ప్రదమైన భవిష్యత్తు వుంటుందనే ఆశ ప్రధానమైనది. ఏ దేశ సౌభాగ్యమైనా, గొప్పతనమైనా ఆ దేశప్రజల గుణ గణాలమీద, శీలసంపదమీద ఆధారపడి వుంటుందనేది సర్వసాధారణంగా అందరికీ తెలిసిన విషయమే. ప్రజలు శీలవంతులైన కొలది దేశౌన్నత్యం పెరుగు తుంది. ఒక దేశానికి ఔన్నత్యాన్ని సమకూర్చే ముఖ్య లక్షణాలలో ఆ దేశంలోని స్త్రీ పురుషుల లోనూ, పిల్లలలోనూ వుండే సామర్థ్యగుణం గొప్పది. సామర్థ్యంలేనిదే, చెప్పుకోదగిన ఘనకార్యాలు సాధిం చటం జరుగదు. సామర్థ్యంగల జాతి తప్పని సరిగా మంచి క్రమశిక్షణ కలిగి వుంటుంది. ఒకానొక కార్య సాధనకు క్రమపద్ధతిలో వ్యక్తి తన సర్వశక్తులను వినియోగించటం అనేభావం సామర్థ్య గుణంలో యిమిడి వుంటుంది. అందువల్ల మనది గొప్పజాతి అనిపించు కోవాలంటే, సామర్థ్య గుణాన్ని మనం అలవరచు కోవాలి.



రాష్ట్ర గవర్నరు

భారత దేశాన్ని, గాంధీజీ కలలుగన్న ఆదర్శ భారతంగా రూపొందించుకోవాలంటే, ప్రతి రంగంలోనూ మనం యింకా ఎంతో కృషిచేసి సాధించుకోవలసివుంది. కుల, మత ప్రసక్తితోనూ, వాదాలతోనూ నిమిత్తం లేకుండా సమర్థవంతంగా తనపని చేయవలసిన సాంఘిక బాధ్యత మనలో ప్రతి ఒక్కరికీ వుంది. ఎందుకంటే వ్యక్తి సామర్థ్య సంకలన ఫలితమే జాతీయ సామర్థ్య మవుతుంది. ప్రతి చిన్నపనీ, జాతీయ సామర్థ్యంమీద తన ప్రభా వాన్ని ప్రసరింప జేసేదే. ఆ విధంగా చేయలేని

చిన్నపని ఏదీలేదు. సైనికుడుగానీ, పరిపాలనా వ్యవహర్తగానీ, పారిశ్రామిక వేత్తగానీ, వ్యాపారస్థుడుగానీ, ఉద్యోగం యిచ్చిన వాడుగానీ, చేస్తున్నవాడుగానీ, పొలంలో రైతుగానీ, ఫ్యాక్టరీలో కూలీగానీ, ఏ పనిచేస్తున్న వాడైనాసరే, అరడొక పెద్ద యంత్రంలో ఒక చిన్న భాగంగా పనిచేస్తున్నాడు. చిన్నచిన్న భాగాలవిలువ విడిగా గోచరించక పోవచ్చు. కాని ఆ యంత్రాన్ని పని చేయించటంలో వాటి విలువ చాలా ఎక్కువగా వుంటుంది. యంత్రంలోని ఏ చిన్న భాగమునైనా దాని సరియైన స్థానంలో అమర్చి, యితర భాగాలతో సమన్వయింప జేయకపోతే, యంత్రం పని చేయలేదు.

అందువల్ల యీ శుభదినోత్సవ సందర్భంగా, అట్టి ప్రజలందరికీ నా హృదయపూర్వక అభివందనలు అందజేస్తూ, తమతమ సాంఘిక బాధ్యతలను సామర్థ్యంతో నిర్వర్తించు కృషికి జీవితాలను పునరంకితం చేయవలసిందని నా సహచర పౌరులకు విజ్ఞప్తి చేస్తున్నాను.

—శ్రీ భీమసేన్ సాచార్
ఆంధ్రప్రదేశ్ గవర్నరు.



ముఖ్యమంత్రి సందేశం

# ఐక్యత, పరస్పరావగాహన, ఓర్పు, కార్యదీక్ష

దేశమంతా నేడు మహోత్సాహంతో పదకొండవ స్వాతంత్ర్య వార్షికోత్సవం జరుపుకుంటూ సంతోష సాగరంలో ఓలలాడుతోంది దేశ స్వాతంత్ర్య సమరంలో వజ్ర సంకల్పంతో పాల్గొని అసువులర్పించిన అమరజీవులందరు యీ సంతోష సమయంలో మన స్మృతి పథంలోకి వస్తారు మాతృదేశ సేవానురక్తులై అనేక అగ్నిపరీక్షలకు లోనై రకరకాల కష్టనష్టాల ననుభవించి, జీవితాలను అర్పణచేసి, నేడు మనమీ స్వాతంత్ర్యాన్ని అనుభవించటానికి కారణభూతులైన సోదర భారతీయ త్యాగమూర్తు లందరికీ మనం సర్వదా కృతజ్ఞులం



రాష్ట్ర ముఖ్యమంత్రి

చైతన్య వంతమైన భారత పౌరులుగా మనకు గల గొప్ప బాధ్యతలను యీ పవిత్ర దినోత్సవం మనకు గుర్తు చేస్తున్నది ఈ నాడు మరల మనం క్రొత్తగా మాతృదేశ సేవాదీక్ష గైకొనాలి రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించినా, సాంఘిక విముక్తి, ఆర్థికాభివృద్ధికి సంబంధించిన సమస్యలు యింకా అపరిష్కృతంగానే నిలిచి వున్నవి. స్వాతంత్ర్య సమరం రోజుల్లో మనకు చైతన్యం ప్రసాదించిన సేవానురక్తి, త్యాగదీక్షలతోనే, దేశ సర్వతోముఖాభివృద్ధికి ఉద్దేశించిన పంచవర్ష ప్రణాళికల మహాలక్ష్యాలను నేడుకూడా సాధించుకోవాలి.

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం మనంజరుపుకున్న స్వాతంత్ర్య దినోత్సవాలలో యిది రెండవది. గడచిన కాలంలోకి ఒకసారి వెనుదిరిగి చూసుకుంటే, సాధించిన ఘనకార్యాలకూ, పొందిన అభివృద్ధికీ, మన రాష్ట్రం నిజంగా గర్వపడవచ్చు. రాష్ట్రంలో అనేక గొప్పగొప్ప ప్రాజెక్టులు అమలు జరుగుతున్నవి. పాఠశాలల, కళాశాలలసంఖ్యా, విద్యార్థులసంఖ్యా, బాగా పెరుగుతున్నది. వైద్యసౌకర్యాలు, సాంఘిక సేవా కార్యక్రమాలు విస్తృత మవుతున్నవి. సామాజికాభివృద్ధి కృషిలో మనరాష్ట్రం నాయకత్వం వహించి అన్ని వైపులనుండి ప్రశంసల నందుకుంటున్నది. ఈ కారణాలవల్ల పారిశ్రామికాభివృద్ధికై కేంద్ర ప్రభుత్వంనుండి మనం కోరుతున్న సహాయం లభించే అవకాశాలు కనిపిస్తున్నవి. పైగా, రాష్ట్రాభివృద్ధి కృషిలో ప్రజల విశ్వాసం పెరిగి, వారినుండి యితోధికంగా సహకారం లభిస్తున్నది

ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం కోరిన ఋణం సునాయాసంగా లభించటమే యిందుకు చక్కని తార్కాణం. ప్రజలు పట్టుదలతో, ఐక్యత, పరస్పరావగాహన లక్షణాలను అలవరచుకొని ప్రదర్శించి నందు వల్లనే యీ అభివృద్ధి సాధ్యమైంది. శ్రమపడి, ఓర్పుతో, గట్టిగా కృషి చేయటం మన ప్రజలందరికీ అలవాటే. ఐక్యత, పరస్పరావగాహనతోపాటు యీ కృషి లక్షణాన్ని గూడా ప్రదర్శిస్తేనే భవిష్యత్తులో యింకా గొప్ప కార్యాలను మనం సాధించ గలుగుతాం. ఇటువంటి దృఢ సంకల్పంతో మనమందరం కృషి చేయగలమని ఆశిస్తున్నాను.

జై హింద్ !

—శ్రీ యన్. సంజీవరెడ్డి
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి.



ప్లానింగు మంత్రి సందేశం :

# "కష్టపడి బాగా పనిచేద్దాం"

"స్వాతంత్ర్యానికి చెల్లించ వలసిన మూల్యం అంతులేని అప్రమత్తత" అనే నానుడి మన జాతి చరిత్రలో యిటీవలి గత కాలంకంటే వర్తమాన కాలానికి ఎక్కువ వర్తించే సత్యం. మనం సముపార్జించుకొన్న స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసుకోటానికి సాధ్యమైనంత కృషి జరుగుతున్నది. దేశంలోని గడ్డు పరిస్థితినిగానీ, బయటనుండి వచ్చే ఒత్తిడులనుగానీ తట్టుకొని నిలువగల సుస్థిర ప్రభుత్వం దేశానికి లభించినమాట నిజమే. అయినప్పటికీ, రాజకీయ స్వాతంత్ర్యానికి తోడు ఆర్థికవిముక్తికూడా సాధించామనే సంతృప్తిని యిప్పుడే ప్రకటించ లేని స్థితిలోవున్నాం. ప్రణాళికలోని వివిధ కార్యక్రమాలలో దేశంలో బహుముఖంగా కృషి జరుగుతున్నది. గ్రామ పంచాయతీలకు ఎక్కువ అధికారాలను, అదనపు బాధ్యతలను సంక్రమింప జేస్తున్న "ప్రజాస్వామిక వికేంద్రీకరణ" పద్ధతి ప్రయోగాత్మకంగా ప్రారంభించ బడటంతో, సామాజికాభివృద్ధి కార్యక్రమం మరొక అభ్యుదయ కరమైన దశలో ప్రవేశించింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేనాటికి గ్రామీణ ప్రజలందరూ యీ నూతన పరిణామ శుభప్రభావానికి లోనవుతారు. అయితే యివన్నీ చెప్పుకోదగిన ఫలితాలే అయినప్పటికీ. మన జాతికి అత్యవసరమైన ఆర్థిక సంతృప్తిని అందించటానికి చాలవు. ఎక్కువ ఉత్పత్తి చేయటానికీ, ఎక్కువగా నిలువ చేసుకోటానికీ మనం యింకా గట్టిగా కృషిచేయాలి ఎందుకంటే జాతీయకృషిలో పెట్టుబడి పెట్టిన నిలువ మొత్తాలే, ఆ జాతియొక్క ప్రాతిపదిక సంపద

మత ప్రసక్తిలేని రాజ్యాంగంలో సోషలిస్టు తరహా సమాజ పద్ధతిపై ఏర్పడే ప్రజాస్వామిక వ్యవస్థలోనే—యీ త్రివేణీ సంగమంలోనే—సంపూర్ణ సంక్షేమ రాజ్యస్థాపన అనే పవిత్ర లక్ష్యాన్ని మనం అందుకోగలుగుతాం ఆనందోత్సవాలతో యీనాడు మనం జరుపుకుంటున్న స్వాతంత్ర్య దినోత్సవాల సందర్భంగా ఆ పవిత్ర లక్ష్య సాధనకు జీవితాలను తిరిగి అంకితం చేసుకుందాం



రాష్ట్ర ప్లానింగు, అభివృద్ధి శాఖామంత్రి శ్రీ వి. బి. రాజు.

—శ్రీ వి బి రాజు

ప్లానింగ్, అభివృద్ధి, సమాచార శాఖామంత్రి.

శాంతి పథంలో:

# నవ భారత యాత్ర

## సార్వజనీన శ్రేయస్సుఖాలే గమ్యం

(రాష్ట్ర ముఖ్యమంత్రి)

కాలం విమానంలా దూసుకొని పోతున్న రోజులివి. ఇట్టేవచ్చేసింది స్వాతంత్ర్య దినోత్సవం. నవభరతుడు పదకొండేళ్లు నిండి పన్నెండేళ్ల బాలా కుమారుడయ్యాడు. దాదాపు నలభయి కోట్ల ప్రజల గుండెలు జయ ఘంటలై మోగి మారు మోగుతున్న పండగరోజు ఈ నాడు.

మన దేశానికి స్వరాజ్యంవచ్చిన శుభముహూర్తం విశ్వచరిత్రకే ముఖ్యంగా గోచరిస్తుంది. రెండవ ప్రపంచసంగ్రామం అస్తమించి, విజ్ఞాన శాస్త్రరంగంలో నవోదయం ఉషః కాంతులను వెదజల్లిన యుగసంధ్యలో నవభారతం, స్వతంత్ర భారతం తన జ్యోతిర్ నేత్రాలను తెరచింది.

అంతర్జాతీయ రంగంలో జరిగిన ఏవో కొన్ని సంఘటనలకు, మన స్వరాజ్య ప్రాప్తికి చారిత్రకంగా ఏదో ముడి పెట్టుతున్నానని అనుకోవద్దు. భౌగోళికంగా భారతదేశం ప్రపంచంలో ఒక భాగం. అలాగే ప్రపంచ గమనానికి భారతదేశ స్థితిగతులకు లంకె లేక పోలేదు. ప్రాచ్య పాశ్చాత్య రాజ్యాలు మొదటి ప్రపంచ సంగ్రామం నుంచి అవలంబించిన మనస్తత్వ ఫలితమే, అనగా వైఫల్యమే రెండవ ప్రపంచ సంగ్రామానికి సిగ్నల్ నిచ్చింది. ఇటు మనుషుల మనస్తత్వం రాజకీయ రంగంలో కల్లోలాను తెచ్చిపెట్టితే, అటు ప్రకృతీ రంగంలో విజ్ఞాన శాస్త్రం ఘన విజయాలను సాధించింది. అపూర్వమైన శక్తి సంపదలు మానవుడికి లభించనున్నాయి. కాని వీటిని మానవ జాతి శ్రేయస్సుకు సరిగా వూన్చుకొనటం ఎలా ? ప్రాచ్య పాశ్చాత్య రాజ్యాల మనస్తత్వం ఈ ప్రశ్నను పరిష్కరించ లేకపోతోంది. ఇట్టి సందిగ్ధ సమయంలో భారతదేశం తలెత్తింది. శతాబ్దాలుగా అనేక విధాల కృశించి పోయిన దేశం. దారిద్ర్యం, అనారోగ్యం, క్షామాలు, అవిద్య...ఎన్నో దేశాన్ని పీల్చి పిప్పిచేసినాయి. కాని దేశపు లోపలి తేజస్సు, భావనా శక్తి, సత్యాగ్రహణ,...అవి రవ్వంత కూడా బీరు పోలేదు. అందుకే స్వరాజ్యం వచ్చినప్పటి నుంచి వివేక విజ్ఞాన భరితమైన భారత వాణి అమర వాణిగా ప్రాచ్య పాశ్చాత్య దేశాలన్నిటిలో ప్రతిధ్వనిస్తోంది.

ఎట్టి మనస్తత్వాన్ని అలవరచుకుంటె, విజ్ఞాన శాస్త్రం బహిర్గతం చేస్తున్న అపూర్వ ప్రకృతి శక్తులను మానవ కల్యాణానికి జోడించుకోవచ్చునో తెలియ జేయవలసిన చారిత్రక ధర్మం భారతదేశానిదిగా తోస్తోంది. ఆది నుంచి ప్రపంచప్రజల చరిత్రలో భారతీయుల ఆత్మ కథ ఇట్టిదిలాగానే తోస్తుంది. ప్రకృతీ శక్తుల భోగ భాగ్యాలకోసం కత్తులు దూసుకోటం కాదు, మానవ కర్తవ్యం. వాటిని ఉత్తమ సంస్కృతికి పోషకంగా వశపరచుకొని సర్వజనుల శ్రేయస్సుకు వినియోగించాలి అనే ధర్మాన్ని అనుసరించి ప్రబోధించటమే భారతదేశపు ప్రత్యేక కర్తవ్యంగా కనబడుతుంది. భోగభాగ్యాలు, సుఖ విలాసాలు...వీటితో తృప్తిపడే దేశం కాదిది. వీటికి, వీటి వికృత ప్రభావాలకు లోనవనీయకుండా మానవుడిని పైకెత్తి, ప్రకృతికి నేతగా, అధిపతిగా ఒకానొక ధర్మ సంస్థాపకునిగా నిలబెట్టే దేశం ఇది. మన చరిత్రను పరిశీలిస్తే, దేశనిజతత్త్వం ఇదే అనే నిజం ఉద్ధతి పతనాల్లోంచి మెరుస్తూ గోచరిస్తుంది. అటు పరస్పర చిత్రవధ వరకూ వెర్రితలలు వేస్తున్న అంతర్జాతీయ రంగంలో మన దేశపు చారిత్రక ధర్మాన్ని క్లుప్తంగా పరిశీలించాం.

మరి మన దేశంలోని సంగతి ఏమిటి ?

శతాబ్దాలదాస్యం, దారిద్ర్యం తర్వాత, స్వరాజ్యం వచ్చి పదేళ్లుపైగా అయింది. తుపానుకు ఇల్లు, వాకిలి, పంట, పైరు, గొడ్డు, మేక అన్నీ ఎక్కడి కక్కడ చెల్లా చెదరై నట్టుగా ఉన్నది దేశం. దేశమన్నప్పుడు ఒక విషయం గుర్తుంచుకుందాం. పాశ్చాత్య దేశాల్లాంటివి సుమారు పది దేశాల పరిమాణం కలట్టిది మన దేశం. విభజన తర్వాత కూడా జనాభా దృష్ట్యా కూడా ఇంతే. దీనినిబట్టి కర్తవ్యం ఎంత గురుతర మైనట్టిదో సరిగ్గా గ్రహించటానికి వీలవుతుంది.

మళ్లీ దేశాన్ని అన్ని రంగాల్లో పునాదులనుంచి నిర్మించుకొని రావాలి. పిల్ల వేరుల దగ్గర నుంచీ శ్రద్ధ తీసుకుంటూ పెంచితేనే, ఈ కల్పవృక్షం మళ్లీ అమృత ఫలాల నిస్తుంది. కఠోరమైన దారిద్ర్యం, విస్తారమైన అనారోగ్యం, వేరుకు పోయిన అవిద్య వీటన్నిటిని తొలగించి, దేశాన్ని జవసత్త్వాలతో, సిరి సంపదలతో, విద్యా సంస్కృతులతో కలకల లాడేట్టు చేయాలి. పొలాల్లోంచి, కర్మా గారాల్లోంచి, గను ల్లోంచి సిరిసంపదలను సృష్టి చేయాలి. యావన్మంది ప్రజల వికాసానికి అవితోడ్పడాలి.

అందుకే రాజకీయంగా ప్రజాస్వామ్యాన్ని, ఆర్థికంగా సోషలిజాన్ని ఎంచుకున్నాం. ఏవో కేవల సిద్ధాంతరాద్ధాంతాలుగా కాదు, సువిశాలమైన దృక్పథాలుగా అవలంబించాం.

ఇన్ని శతాబ్దాలు తర్వాత వచ్చిన స్వాతంత్ర్యం ఏఒక నియంత యొక్క, లేక వర్గం యొక్క నిరంకుశత్వంగానో భ్రష్టమవ కూడదు. కాబట్టే రాజకీయంగా ప్రజాస్వామ్యం అవసరం. శతాబ్దాలుగా అనేకులు అనేక విధాల దోచుకొని పోయినప్పటికి, ఇంకా నిజానికి దేశ సంపద అక్షయంగానే ఉన్నది. ఈ సంపదను ఏకొందరు రాజకీయ రాద్ధాంత సిద్ధాంతులో తమ ప్రాబల్యవిస్తరణకు ముడిపదార్థంగా దుర్వినియోగం చేయకుండా వుండేట్టు ప్రజాస్వామ్యం కాపాడుతుంది.

ఇక ఈ సంపదను ఎవరూ వైయక్తిక విలాసాలకు వినియోగించుకొని, ఆ విధంగా తమకు, అందరకూ, ఆర్థిక సంక్షోభం కలిగించకుండా వుండేందుకై సోషలిస్టు దృక్పథాన్ని అవలంబించాం. స్వతంత్ర భారత దేశ ప్రజలు ఈ ఆదర్శాలతో తమ దేశాన్ని ఇన్నాళ్లకు పునర్నిర్మించు కుంటున్నారు. ప్రతి వ్యక్తి సంపూర్ణంగా వికసించేట్టుగా ఆర్థిక రాజకీయ రంగాలను రూపొందించు కోవాలి. మనకు ముఖ్యం మనుష్యుడు. మనుష్యుని తర్వాతే మిగతావి. ఏదో ఒక విధంగా, దారిద్ర్యంతోనో, పంచభక్ష్య పరమాన్నాలతోనో జీవించే మనుష్యుడుగాకాదు. ఈ భూమిపై సత్యాన్ని, శాంతిని, సంస్కృతిని, ఉత్తమ ధర్మాన్ని నెలకొల్పగలిగే మనిషే మనిషి. ఎవరో కొందరి పిడివాదాలు కాదు కావలసింది. ప్రతివ్యక్తి జీవిత తత్త్వాన్ని తెలుసుకొని, అలా తన వికాసానికి ఇతరుల వికాసానికి తోడ్పడేట్టు జీవించాలి. అటువంటి శోభామయ జీవిత జ్యోతికి నిజానికి ఈ ప్రకృతి వసతులన్ని ప్రమిదె, దీపపు వత్తీనూ. ముఖ్యం దీపం. కాంతిని వెదజల్లటానికే ప్రమిదె. వత్తి. ఇలా ఒక మహోజ్వల ఆదర్శాన్ని, సంస్కృతిని దైనందిన జీవితంలో నిత్యానుభవంగా పరిణమింప జేయటానికి ప్రకృతీ శక్తులను వినియోగించాలి.

స్వరాజ్యం వచ్చాక ప్రజాస్వామ్య ధర్మాన్ని అనుసరించి రాజ్యాంగాన్ని తయారు చేసుకున్నాం. ఒకే రాజనీతి దేశమంతటా సుస్థిరమవటం మన దేశ చరిత్రలో ఇదే మొదటిసారి అనవచ్చును. మన రాజధాని ఢిల్లీలో పార్లమెంటు, రాష్ట్రాల్లో శాసన సభలను ఏర్పరచుకున్నాం. ప్రజా ప్రతినిధులు రాజ్యాంగాని కనుగుణంగా దేశ పునర్నిర్మాణానికి పథకాలను రూపొందిస్తున్నారు. ప్రణాళికలద్వారా యావత్తు దేశ పురోభివృద్ధిని సాధిస్తున్నాం. ఈ నవీన విజ్ఞాన శాస్త్రయుగంలో ఆర్థికాభ్యుదయ మనేది కేవల వ్యక్తులకు మించినట్టిదే. అలాగే సాంఘిక దృక్పథంలో వస్తున్న మార్పులబట్టి కూడా సంఘపు ఆర్థిక పరిస్థితులు కేవలం కొలదిమంది వ్యక్తులపై ఆధారపడి ఉండటానికి వీలులేదు.

కాబట్టే కేవలం ఏవో శిస్తులుమాత్రమే వసూలు చేసే ప్రభుత్వం నేడు ఆర్థిక వ్యవస్థా నిర్మాతగా పరిణమించింది. ఇది చారిత్రకమైన పరిణామం. ప్రజాశ్రేయస్సుకు దోహదపడే పరిణామమే. తత్ఫలితంగా మనం మొదటి ప్రణాళికను తయారు చేసు

కున్నాం. ఎన్నో అవరోధాలున్నప్పటికీ, ప్రణాళికను జయప్రదం చేసుకున్నాం. మొదటి ప్రణాళికా సమయంలో తెలంగాణా, ఆంధ్రాలు విడివిడిగా ఉన్నాయి. నిజానికి మనది కొన్ని దేశాల భూఖండం లాంటిది. వివిధ భాషల ప్రజలున్నారు. ప్రజా స్వామ్యంలో ప్రజల కందుబాటులో ఉండాలి పరిపాలనా యంత్రం. అందుకని భాషా రాష్ట్రాలను ఏర్పరచుకున్నాం. ఈ సందర్భంలో ఆంధ్రులు అగ్రగాములయ్యారు. స్వరాజ్యంలో తొలిసారిగా స్వరాష్ట్రాన్ని ఏర్పరచుకున్నాం. తత్ఫలితంగా ఇతర భాషా రాష్ట్రాలు ఏర్పడినాయి. తెలంగాణ, ఆంధ్ర ఏకమైనయ్. ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. కొత్త రాష్ట్రాల ఏర్పాటు, రెండవ ప్రణాళిక రచన ఇంచు మించు ఒకే సమయంలో జరిగినయ్. ఈ ఏర్పాటు ప్రణాళికలకు కూడా దోహదపడుతుంది. ముక్కోటి ఆంధ్రులు ఒకే ఒక సమగ్రపథకాన్ని రాష్ట్రాభివృద్ధికి రూపొందించుకొన గలిగారు. రెండవ ప్రణాళిక కూడా సగం గడచింది.

స్వాతంత్ర్యం వచ్చిన పది, పదకొండేళ్లలో అటు రాజకీయ రంగంలో నెలకొల్పుకొన్న ఉత్తమ ప్రజాస్వామ్య వ్యవస్థను, ఇటు ఆర్థిక రంగంలో అవలంబిస్తున్న ప్రణాళికలను దృష్టిలోకి తెచ్చుకుంటే, మన ప్రజలు ఎలాంటి అద్వితీయ ఘన విజయాలను సాధించారో, ఎంత వేగంగా పురోగమిస్తున్నారో తెలుసుకోవచ్చు. మనం వెళ్తున్న వేగం కొంతమందికి తృప్తికరంగా లేకపోవచ్చు. బుద్ధి నిశ్చయించుకొన్న భావం క్రియారూపం తాల్చటానికి కొంతకాలం పట్టుతుంది. అందులోనూ దేశపు మొత్తం పురోగమనాన్ని ఎంచి లెక్కించాలంటే, అందుకు వైయక్తికమైన ఉద్రేకం కాదు త్రాసు. చరిత్ర ఇతర దేశాలతో పోల్చి చూసుకోవాలి. రాజకీయ స్థిరత్వం, ఆర్థిక సౌష్ఠవం, నిర్మాణాత్మక కృషి, శాంతి, సంస్కృతి వీటిని ప్రమాణాలుగా పెట్టుకొని పోల్చాలి. అప్పుడు జయ పతాక మన ప్రజలదే అనే విషయంలో అనుమానం ఉండదు. అయితే ఇంకా ఇంకా వేగంగా సాగిపోవాలి. కాని చేసిన కృషిని కించపరచు కొనటం ద్వారా కాదు, ఇంత చెయ్యగలిగాం కదా, అనే ఆత్మవిశ్వాసాన్ని, వాస్తవ దృక్పథాన్ని అలవరచుకొని; ఇంకా ఎంతో చెయ్యగలం అనే ధీమాతో, చెయ్యాలి అనే పట్టుదలతో వడివడిగా సాగిపోవాలి.

స్వరాజ్యం వచ్చిన యీ పది పదకొండేళ్లలో ఎన్నో ప్రాజెక్టులను నిర్మిస్తున్నాం. చేసే కృషి యీ నాటిది. కాని వాటి ప్రభావం తరతరాలది. దామోదరలోయ, భక్రానంగల్, హీరాకుడ్, భవానీ, తుంగభద్ర, నాగార్జునసాగర్ ప్రాజెక్టులు, వివిధ పరిశోధనాలయాలు, భారీ ఫ్యాక్టరీలు, పెనిసిలిన్ ఉత్పత్తి కేంద్రం, నౌకా వైమానిక పరిశ్రమలు, రైలు ఎంజిన్ల నిర్మాణం, గనులు......ఇవన్నీ దేశ ఆర్థిక వ్యవస్థకు చెక్కుచెదరని ఉక్కుస్తంభాల్లాంటివి. ఈ కార్య రంగాల్లో నేటితరంవారు పడుతున్న శ్రమ, దేశ నిర్మాణానికి నేటివారు ఇస్తున్న విరాళాలు వారి వారసుల పెన్నిధి అన్నమాట. ఏటేటా స్కూళ్ల సంఖ్య పెరిగి పోతోంది. వైద్య కళాశాలలు, వైద్యాలయాలు, నిర్మింపబడుతున్నవి. పల్లె సీమ అంతా మహాసందడిగా ఉంది. ఒక పల్లెలో ఒక పాఠశాల లేచిందంటే, అది చిన్న విషయంకాదు. చీకట్లో దీపంలాంటిది. నేడు మనంచేసే పనులు చిన్నవిగా గోచరించవచ్చు. విత్తుచిన్నదే. నలుసే. అందులోనుంచే మహావృక్షం లేస్తుంది.

కాలవలద్వారా నీటిని ప్రవహింప జేసినట్లు, ప్రణాళికల ద్వారా ప్రజలు తమశక్తి సంపదలను క్రమపద్ధతిన పునర్నిర్మాణానికి సరిగా వినియోగించుకో గలుగుతున్నారు. అంతర్జాతీయ రంగంలో మన దేశానికి విశిష్టస్థానం ఎందుమూలంగా ఏర్పడిందో వివరించాను. ఆ యుధబలంబట్టి, కూటాల బట్టికాదు. ఉత్తమమైన మన సత్త్వానికి మనదేశం పెట్టింది పేరుగా ఉండటంవల్లనే అతిరథులు, మహారథులుకూడా మనవైపు మొగ్గుతున్నారు.

ఇవ్వాళ, మన మహాదేశపు పుట్టినరోజు పండగైన ఇవ్వాళ నేను యీ విషయం గురించే నొక్కి చెప్పా లనుకున్నాను. కట్టడాలు, ప్రాజెక్టులు, కర్మాగారాలు ఎన్నో నిర్మించాం...ఎన్నో నిర్మిస్తాం. ఎవరైనా నిర్మిస్తారు. కాని మన జీవితానికి, సంఘానికి, ప్రజలకు ఏమిటి ఆదర్శం? సార్వజనీన

శ్రేయస్సే, ఏవర్గ ప్రాబల్యమూలేని సమసమాజ అభ్యుదయమే, ప్రజలందరి శాంతి సౌఖ్యాలే మనకు ఆదర్శంగా ఉండాలి. ఏ మనస్తత్వంతో పనిచేస్తామో, దాన్నిబట్టే ఫలితం ఉంటుంది. ఏదో సంకుచితవర్గ దృక్పథంబట్టో, లేక వైయక్తిక విలాస దృక్పథం బట్టో పనికి పూనుకుంటె సంఘర్షణలు తప్పవు. మనంపడే శ్రమ అంతా వ్యర్థమవటమేకాక, నానావిధాల దుఃఖదైన్యాలకు దారి తీస్తుంది.

దేశచరిత్రలో అనాదిగా ఆంధ్రులకూ విశిష్టస్థానం ఉంది. నేడుకూడా, నేటి చారిత్రక పరిస్థితుల్లోకూడా మనం మన ఆలోచనల ద్వారా, కార్య కలాపాల ద్వారా ఆ విశిష్టస్థానాన్ని యినుమడించుకొందాం. మొత్తం దేశపు ప్రభావం ఇంకెక్కువ అవాలంటే, దేశంలో ఆ ప్రభావానికి సరైన దోహదం చేయాలి. ఐకమత్యం, పరస్పర సహకారం, ఓర్మి, నిదానం, ప్రశాంతంగా విషయాలను పరిశీలించటం...ఇవన్నీ మనకు ఎంతో అవసరం. ముఖ్యంగా యీనాడు యువకులకు నా విజ్ఞప్తి:- గుడ్డిగా ఎవ్వరినీ అనుసరించవద్దు. కాని నిదానంగా ఆలోచించండి. దేశ పరిస్థితులను గూర్చి కేవలం మనుష్యులబట్టికాదు, ఆదర్శాలబట్టి. లక్ష్యాలబట్టి. ఇతర దేశాలకేసి చూడండి. స్వంత తొందరపాటు కాదు కావలసింది, సామాజిక సామరస్యం. మన రాష్ట్రంలో జరుగుతున్న అభ్యుదయ కార్యక్రమాలను సహేతుకంగా పరికించండి. ప్రణాళికా కార్య క్రమాల నిర్వహణను ప్రజల పరంచేసే కొత్తవిధానాన్ని,వికేంద్రీకరణ విధానాన్ని దేశంలోకి మొదటగా అమలు జరుపటానికి పూనుకొన్నది మనమే. ప్రజల స్థానిక ప్రతినిధులే తమ స్థానిక కార్య క్రమాలను రూపొందించుకొని నిర్వహించు కుంటారు. ఈ పంచాయతీ సమితులు ప్రజాశక్తిని సరిగా తీర్చి దిద్దగలవు. గోదావరి, కృష్ణ, తుంగభద్ర, వంశధార, పెన్నా...మనకు నదీ సంపద తరగనిది ఉంది. దేశపు పెద్ద ప్రాజెక్టుల్లో నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఒకటి. అది పూర్తయాక, కృష్ణ కాటుకలు దేశమంతటా సమృద్ధిగా లభించి, ఆంధ్ర ప్రదేశ్ భారతదేశానికి ధాన్యాగారం అవుతుంది.

మన సింగరేణి బొగ్గు గనులు దక్షిణ దేశంలో ముఖ్యమైనవి. కేంద్ర ప్రభుత్వం వీటి అభివృద్ధికి తగు సహాయం చేయబోతోంది. పారిశ్రామిక రంగంలో మన రాష్ట్రం ఇంకా ఎంతో అభివృద్ధిని సాధించాలి, సాధిస్తాం.

ప్రణాళికా రంగంలో అనతికాలంలో మనరాష్ట్రానిదే అగ్రస్థానం అవుతుందని ఆశిస్తున్నాను. మనం ఆంధ్రులం స్తబ్ధులం మాత్రం కాదు. పాదరసంలాంటి వాళ్లం చేతినిండా పనికల్పించు కుంటాం. కష్టించి పాటుపడుతాం. విశాల దృక్పథంతో ఉన్నత ఆదర్శ సాధనకు సామరస్యానికి పాటుపడుదాం.

ప్రపంచమంతా వేయికళ్లతో మన దేశంకేసి చూస్తోంది. శాంతి సామరస్యాలను, సుఖ వికాసాలను ఆర్థిక సాంస్కృతిక సమన్వయాన్ని మనం ఇక్కడ దేశంలో సాధించుకొని, వారందరి ప్రతీక్షను సఫలం చేద్దాం. ఈ స్వాతంత్ర్య దినోత్సవనాడు ఇందుకు దీక్ష పూనుదాం. అణుయుగ ప్రపంచంలో నవభారతం ఉత్తమ సాంస్కృతిక దేశం అవాలి.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)



# భారత దేశానికి ధాన్యాగారం కాగల పోచంపాడు

(డా. కె. ఎల్. రావు, కేంద్రజల, విద్యుచ్ఛక్తి కమిషన్ సభ్యుడు.)

గోదావరినది ఆరగాణి (కాచ్‌మెంటు) విస్తీర్ణం 118.191 చ. మైళ్లు (లేక ఇండియాలో రమారమి 1/9 భాగం) అది బొంబాయి, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, మైసూరు రాష్ట్రాలలో వరుసగా 49.2, 22.4, 21.2, 5.8, 1.4 శాతం వున్నది. గోదావరిని స్థూలంగా రెండు బేసిన్‌లుగా విభజించవచ్చు. (1) ఎగువబేసిన్, (2) దిగువబేసిన్. పోచంపాడు వరకు అనగా నదిపొడుగునా 500 మైళ్ల వరకూ యెగువబేసిన్ అనవచ్చు. కృష్ణానది సగంవరకూ దాని ఆరగాణి విస్తీర్ణం విస్తారంగా వుంటుంది. కాని గోదావరి బేసిన్‌లో దాని మధ్య భాగంవద్ద ఆరగాణి విస్తీర్ణం కేవలం 30 శాతం మాత్రమే. అందువల్ల గోదావరి యెగువబేసిన్‌లో నీరు యెక్కువ వుండదు. పశ్చిమ కనుమలలో కొంచెం భాగంలో తప్ప (బేసిన్‌లో 2 శాతం) యెగువ బేసిన్‌లో వర్షపాతం కూడా 40 అం. కంటె తక్కువే. మళ్లీ పోచంపాడుకి దిగువన దిగువ బేసిన్‌లో సాలుసరి వర్షపాతం 40 అం. మించడమే కాక అది 75 అం. వరకూ పెరుగుతుంది కూడా.

పోచంపాడు యెగువబేసిన్ చివరవుంది. పోచంపాడువద్ద ఆరగాణి విస్తీర్ణం 34,900 చ.మైళ్లు. ఈ బేసిన్‌లో మొత్తం 560-600 టి. ఎమ్. సి. (12.8-13.8 ఎమ్.ఎ.ఎఫ్.టి.) నీరు లభించగలదని లెక్కలవల్ల సూచితమవుతున్నది. దురదృష్ట వశాత్తూనది యీ భాగంలో నీరు సరిగా కొలవబడనందున సరిగ్గా యెంతవుంటుందో తెలియడం లేదు.

ప్రధాన నదిలో పోయే నీటివివరాలు 1955 ఆగస్టునుంచి మంచిర్యాల రైల్వే బ్రిడ్జివద్ద పరిశీలించ బడుతున్నాయి. ఈ బ్రిడ్జి పోచంపాడు స్థలంనుంచి 97 మైళ్ల దిగువన వున్నది. పోచంపాడు ఆనకట్ట స్థలం, మంచిర్యాలల మధ్యగల అదనపు ఆరగాణి విస్తీర్ణం 4100 చ. మైళ్లు మాత్రమే. 1955 ఆగస్టు, డిసెంబర్ల మధ్య, 1956 మే, అక్టోబర్‌లమధ్య, ప్రవహించిన నీరు వరుసగా 1740, 1040 టి.ఎమ్. సి.ఎఫ్.టి. (40, 24 ఎమ్.ఎ.ఎఫ్.టి.) పోచంపాడు స్థలంలో లభిస్తుందనుకొన్న దానికంటె యిది యెక్కువ. కాని మంచిర్యాలలో 2 సంవత్సరాలు మాత్రమే పరిశీలనలు జరిగినందున యీ విషయంలో యింతకంటె యెక్కువ చెప్పడానికి అవకాశంలేదు.

## ప్రాజెక్టు

ఎగువబేసిన్ చివర లభించే నీటిని పూర్తిగా కాని సాధ్యమైనంత యెక్కువగా కాని వినియోగించు కోవాలంటే పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణం ఒక్కటే సాధనం. హైదరాబాదు-నాగపూరు గ్రాండ్ ట్రంకు రోడ్డుమీద సోనేరోడ్డు బ్రిడ్జికి 3 మైళ్ల యెగువనగల పోచంపాడువద్ద ఒక ఆనకట్టను నిర్మించాలి. జలాశయం మట్టం 1093 గా నిర్ణయించ బడింది. దాని మొత్తం నిలవశక్తి 125 టి.ఎమ్.సి. ఆనకట్ట 133 అ. (గరి.) యెత్తువుంటుంది. ఇది ప్రధాన నదిభాగంలో 3492 అ. పొడుగున రాతితో నిర్మించ బడుతుంది. దాని కుడి, యెడమల వరసగా 21,454 అ., 22,032 అ. మట్టి కట్టలుంటాయి. నదీ గర్భానికి 2, 3 అ. దిగువన మంచి గ్రానెటిక్‌రాయి వున్నదని పరిశోధనలవల్ల తెలిసింది. దీనివల్ల రాతి ఆనకట్ట పునాదుల విషయంలో చిక్కురాదు. ఆనకట్ట యెత్తు కేవలం 133 అ.లే అయినందున ఇంజనీరింగు విషయాలకి సంబంధించిన సమస్యలుకూడా యేమీ తలయెత్తవు.

రెండు వైపుల నుంచి 2 కాలవలు బయలు దేరతాయి. ఉత్తర వైపున గల కాలువ చిన్నది. దీని ప్రవాహ పరిమాణం 450 క్యూసెక్కులు. ఇది ఆదిలాబాదుజిల్లాలో 50,000 యెకరాలకు నీటిని అందిస్తుంది. దక్షిణ కాలవ ప్రవాహ పరిమాణం 14,500 క్యూసెక్కులు. ఇది 45 వ. మైలువరకూ కొంచెం మామూలు భూమిపై కాంటూర్ కాలవగా ప్రవహిస్తుంది. ఇక్కడ దానికి ఒక కొండ అడ్డువస్తుంది. ఒక మైలు పొడుగున ఆ కొండను త్రవ్వడం తప్పనట్లు కనబడుతుంది. అలా కాక ఆకొండను చుట్టి తీసుకువస్తే యెక్కువ పొడుగు గల కాలవ బహుశా యెక్కువ ఖర్చుపై యేర్పడుతుంది. ఈ కాలవ కరీంనగరం, వరంగల్లు జిల్లాల పశ్చిమ సరిహద్దుల మీదుగా ప్రవహించి చివరకి హలియా నదిలో కలుస్తుంది. దీనిని తగిన విధంగా నాగార్జున సాగర్ యెడమ కాలువ సిస్టంతో కలుపవచ్చు. ఈ కాలవ మొత్తం 232 మైళ్ల పొడుగువుండి కరీంనగరం, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ జిల్లాల్లో విస్తారమైన ప్రదేశాలకి, నిజామాబాదులో స్వల్ప ప్రదేశానికి వుపకరిస్తుంది.

ఈ కాలవకుడివైపునకూడా మంచి సారవంతమైన మైదానాలు కొన్ని వున్నాయి. ఇవి 20,000-50,000 యెకరాల ఖండాలుగా వున్నాయి. 50 నుంచి 100 అడుగుల యెత్తువరకూ తోడి కనీసం 50,000 యెకరాల కయినా నీటిని సరఫరా చేయవచ్చు.

ఈ కాలవ మీదుగా పెద్ద పెద్ద వాగులు 11 ప్రవహిస్తాయి. కరీంనగరం దాటి ప్రవహించే మనైర్ వీటిలో ముఖ్యమైనది. దీని నీటిని 8 టి. ఎమ్. సి. ని నిలవ చేయగల జలాశయంలో నిలవ చేసి కరీంనగరం సమీపంలో రమా రమి లక్ష యెకరాలకి నీటిని సరఫరా చేయవచ్చు. ఈ వుపపథకాల వల్ల ఒకటి, ఒకటిన్నర లక్షల యెకరాలకి నీరు లభిస్తుంది. ఈ విధంగా పోచం పాడు ప్రాజెక్టు క్రింద మొత్తం 20 లక్షల యెకరాలకు నీటిపారుదల లభిస్తుంది.

ఆనకట్ట వ్యయం రూ 10.5 కోట్లు. పైన సూచించిన వుప నిర్మాణాలతో సహా కాలువల వ్యయం రూ 52.8 కోట్లు. ఈ నిర్మాణాలు చాలా సామాన్యమైన వైనందున సిమెంటు, ఉక్కు లేక విదేశ మారకం వంటి కొరత వస్తువులు యేవీ వీటికి అవసరంవుండదు. హెడ్‌వర్క్సు వద్ద 25,000 కె.వా. సీజనల్ పవర్ ని 60 శాతం. ఎల్.ఎఫ్. వద్ద వుత్పత్తి చేయవచ్చు. కాని ఆనకట్టలో తగిన వసతులను కల్పించుటతప్ప యిప్పుడు దానిని పరిశీలించ నవసరం లేదు.

## కాలువల క్రింది భూములు

దక్షిణ కాలవ క్రింద మొత్తం 64 లక్షల యెకరాలు వున్నాయి. వీటిలో దాదాపు 24 లక్షల యెకరాలు అడవులు, కొండలక్రింద, 6 లక్షల యెకరాలు గ్రామాలు మున్నగువాని క్రింద వున్నాయి. మిగిలిన సాగులాయ కయిన భూమి 34 లక్షల యెకరాలువుంటుంది. ఇందులో 100కి 60 వంతులకి నీటి పారుదల లభింప చేయాలని సంకల్పం. నీటిని పంపు చేయుట ద్వారాను, వుత్తర కాలువ ద్వారాను నీటి పారుదలను పొందే ప్రాంతాలను కూడా కలుపుకుంటే మొత్తం 20 లక్షల యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది.

ఈ ప్రాంతంలో పూర్వకాలంనుంచీ నిర్మించబడిన చిన్న చిన్న చెరువులు చాలా వున్నాయి. వాటి సంఖ్య 18,000 వరకూ వుందని చెప్పబడుతున్నది. వాటిలో రామప్ప, పాకాల్ చెరువుల వంటివి కొన్ని పెద్దవి. అనుకూలమైన ప్రతిచోటా చెరువు వున్నది. వీటిలో బాగా పనిచేసే చెరువులకు నీటిని వాగులేక నది అందిస్తుంది. ఈ చెరువులు యెంతెంత నీటిని నిలవ జేస్తాయో యెంతెంత భూమికి - నీటిని అందిస్తాయో తెలుసుకొనవలసి వున్నది. గోదావరిలో అదనంగా వున్న నీటిని నిలవ చేయుటకు, ప్రస్తుతం వాటి క్రిందగల ఆయకట్టును స్థిరీకరించుటకు యీ చెరువులు వుపకరించాలి. ఈ ప్రాంతంలో భూములు యెర్ర యిసుక నేలలు. తీవ్ర నీటి పారుదలకి అవి మిక్కిలి తగి వున్నాయి. "ఈ ప్రాంతంలో తెలుగు మాట్లాడే ప్రజలు నివసిస్తున్నారు. వారు నీటి పారుదలకి అందు బాటులో గల సౌకర్యాల నన్నిటిని పూర్తిగా వినియోగించు కొనుటకు సంసిద్ధులై వుంటారు." (1903 నీటి పారుదల కమిషన్.) ఈ ప్రాంతంలో పరిశ్రమలు లేవు. అసలు

భారతదేశమే వ్యావసాయిక దేశం. అందులో తెలంగాణా బహుశా చుట్టుపట్ల ప్రదేశాలన్నిటి కంటె యెక్కువగా వ్యవసాయంపై ఆధార పడుతుంది.

ఇటువంటి నీటి వనరులుగల యితర ప్రాంతాలతో పోల్చి చూసినప్పుడు యీ ప్రాంతాలకు నీటి పారుదల యొక్క ఆవశ్యకత యెటువంటిదో స్పష్ట పడుతుంది. నీటి పారుదల కాలువలు, బావులు, చెరువులు మున్నగు వనరుల ద్వారా జరుగుతుంది. మళ్లీ వీటిన్నిటిలోను బావులు, కాలువల ద్వారా ప్రతి సంవత్సరం తప్పక నీటి పారుదల లభిస్తుంది. చెరువుల ద్వారా నీటి పారుదల విషయంలో స్థానికంగా వర్షాలు బాగాకురిసి, చెరువులు నిండితేనే వ్యవసాయం సవ్యంగా సాగుతుంది. పంజాబులో మొత్తం 32 శాతానికి, వుత్తరప్రదేశ్‌లో 25 శాతానికి నీటి పారుదల లభించగా తెలంగాణాలో 10 శాతానికి మాత్రమే నీటి పారుదల లభిస్తున్నది. దీనిలో మళ్లీ పంజాబులో 32 శాతానికి, వుత్తర ప్రదేశ్‌లో 19 శాతానికి బావులు, కాలవలద్వారా నీటి పారుదల లభిస్తుంది. తెలంగాణాలో యీ శాతం కేవలం 4 మాత్రమే. ఈ విధంగా అక్కడ నీటి పారుదలను పొందే భూమే స్వల్పము. దానికి కూడా వర్షాధారమైన చెరువుల ద్వార లభిస్తున్నది.

నూరు సంవత్సరా క్రిందట సర్ ఆర్థర్ కాటన్ ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణానికి పథకాన్ని సమర్పించినప్పుడు అధికారులు దానికి 'జైగాంటిక్ స్విండిల్' అని పేరు పెటారు. ఆ సందర్భంలో సర్ ఆర్థర్ కాటన్ యీ విధంగా వ్రాశాడు. "చిరకాలంగా సాగే మన పరిపాలనా కాలంలో దిగనారి పోయిన జిల్లా (గోదావరి) తిరిగి సౌభాగ్యాభివృద్ధి పొందుటకై నిశ్చితమైన చర్యను తీసుకొనవలసిన సమయం వచ్చింది. ఈ జిల్లాకి అభివృద్ధి పొందే శక్తి యెంత వున్నదంటే దానికి సమానమైన ప్రదేశం యీ ప్రపంచంలోనే యెక్కడాలేదని చెప్పవచ్చు. దానికి తంజావూరుకి గల సౌకర్యాలు అన్నీ వుండడమేకాక అంతకంటె యెక్కువ సారవంతమైన భూమి వున్నది. అక్కడ నదికంటె వుత్తమమైన యెక్కువ నిశ్చయమైన నది వున్నది. అన్నిటినిమించి మిక్కిలి సులభ సాధ్యమై సురక్షితమైన రేవు వున్నది. దానికి పెద్దనది ద్వారా వుత్తమోత్తమమైన టేకు అడవులనుంచి సరాసరి మార్గమున్నది. ఇటువంటి సౌకర్యం దేశంలో మరెక్కడాలేదు. అటువంటి జిల్లా మన యాజమాన్యంలో అంతగా యెలా దిగనారి పోయిందో చెప్పడం కష్టం".

ఈ నాడు పోచంపాడు ప్రాజెక్టు ప్రాంతాలకు యిదేమాట వర్తిస్తుంది.

తెలంగాణాకుగొప్ప నీటివనరున్నది. విస్తారమైన సారవంతమైన భూములు వున్నవి. వర్షాలుకూడా బాగానే కురుస్తాయి. అయినా అచ్చటి భూములు యెక్కువ పండవు. అక్కడిపంట చెప్పుకోతగినంత మందికి చాలదు. దక్షిణ పెద్దకాలవ క్రిందనున్న 5 జిలాల్లోను చ. మైలుకు కేవలం 244 మంది నివసిస్తారు. గోదావరి లేక కృష్ణా డెల్టాలలో ఆ సంఖ్య అంతకు రెండు రెట్లకు పైనవుంటుంది. ఇక్కడ జనసంఖ్య యింత తక్కువ వుండుటకు కారణం యిక్కడ నీటి పారుదల సౌకర్యాలు తక్కువగా వుండుటే. 1568 లో పశ్చిమ యమునా కాలవను బాగుచేయిస్తూ "వస్తుచయమంతా నీటి నుంచే తయారుఅవుతుంది." అని అక్బరు చక్రవర్తి అన్న మాటలు అక్షరాలా నిజం. పోచంపాడు ప్రాజెక్టువంటి సమగ్రమైన బృహత్పధకం ద్వారా గోదావరీ జలాలు పొలాలకు అందజేయబడితే తప్ప తెలంగాణా సిరి సంపదలతో వర్ధిలజాలదు.

కాలువల క్రింద సాగులాయకైన బంజరు భూములు విస్తారంగా వున్నాయి. నీటి పారుదల లభించిననాడు అవి కూడా సుక్షేత్రాలు కాగలవు. ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల ననుసరించి పనులు అంచెలవారీగా జరుపబడుతున్నవి. జరిగిన పనివల్ల లాభం కలుగుతూవుంటే పెట్టుబడి ఖర్చు క్రమేణా పెట్టబడుతున్నది. స్విట్జర్లండులోని గ్రాండ్ డిక్సన్ నిర్మాణం అంచెలవారీ నిర్మాణంవల్ల కలిగే లాభాలకు చక్కని నిదర్శనం. గ్రాండ్ డిక్సన్ ప్రపంచంలో కెల్లా మిక్కిలి యెత్తయిన (992 అ.) కాంక్రీటు

ఆనకట్ట. అది స్విట్జర్లండులో అన్ని యితర పెద్ద పనులలాగే ప్రభుత్వేతర సంస్థచే నిర్మించబడుతున్నది. విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయకుండా మొత్తం ప్రాజెక్టునంతనూ పూర్తిచేసినట్లయితే కంపెనీ దివాలా తీస్తుంది. కాబట్టి అంచెలవారీ నిర్మాణం తలపెట్టబడింది. ఆ ఆనకట్ట 5 అంచెలలో నిర్మించ బడుతున్నది. ఈ విధానంవల్ల ఇంజనీరింగు చిక్కులు కొన్ని వున్నప్పటికీ అది ఆ విధంగానే నిర్మించ బడుతున్నది.

పోచంపాడు ప్రాజెక్టు అంచెలవారీ నిర్మాణానికి మిక్కిలి తగివున్నది. ఆనకట్టను 'వెయిర్' గా నిర్మించవచ్చు. పునాదులను, ముందుభాగపు చప్టా లను పూర్తి ఆనకట్టకి వలెనే నిర్మించవచ్చు. 'వెయిర్' అగ్రాన్ని 1022 ఎమ్. ఘఅ. రాతికట్టడం, 2 ఎమ్. ఘగ. మట్టి కటడం వద్ద వుంచవచ్చు.

అలాగే కాలువల సిస్టం విషయంలో, కరీంనగరం వరకూ గర్భం వెడల్పును తగ్గించి లైనింగులేకుండా నిర్మించవచ్చు. దాని ప్రవాహ ప్రమాణం 3000 క్యూసెక్కులు వుంటుంది. అడ్డపురాతి పనుల్ని మాత్రం కాలువ అంతకూ చేయాలి. అంచె కాలువ ఖర్చు రూ. 10 కోట్లు అని అంచనా వేయబడింది. దీనివల్ల కరీంనగరం వరకూగల భూములు 3 లక్షల యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది. కాలువ కుడివైపునగల భూములకి పంపుచేయడం ద్వారా పరిమితంగా నీటి పారుదలను లభింపజేయవచ్చు.

## పెటుబడి, ప్రజాసహకారము

నేడు నీటి పారుదల ప్రాజెక్టులకు 30 సంవత్స రాల క్రితం వాటికయే ఖర్చు కంటె 3,4 రెట్లు యింకా అంతకంటె యెక్కువే కూడా ఖర్చు అవు తున్నది. 1927-34 మధ్య నిర్మితమైన మెట్టూరు ప్రాజెక్టుకి (కావేరీ బేసిన్) ఆనకట్ట, కాలువలు మొత్తం రెండిటి నిర్మాణానికి రూ. 7 కోట్లు మాత్రమే ఖర్చయినవి. దీనివల్ల 3 లక్షల యెకరాలకు నీటి పారుదల లభిస్తుంది. దానినే యిప్పుడు నిర్మిస్తే, అందుకు రూ. 24 కోట్లకి మించి ఖర్చు కాగలదు. ఈ ధరవరల పెరుగుదలవల్ల నిజంగా చాలా కష్టంగా వున్నది. ఆహార స్వయం సమృద్ధి విషయంలో కాని పారిశ్రామికాభివృద్ధి విషయంలో కాని మనం పురోగమించలేదు. ఇది యిలావుండగా ధరవరలు మాత్రం పెరిగిపోయాయి. ఇందువల్ల యెక్కువ ప్రాజెక్టుల్ని చేపట్టుటకు పరిస్థితులు అనుకూలంగా లేవు. అయినప్పటికీ కూడా జాగ్రత్తగా పరిశీలించి చాల ప్రాజెక్టుల్ని తొలి, ద్వితీయ ప్రణాళికలలో చేర్చడం జరిగింది. తొలి ప్రణాళికలో చేపట్టబడిన నీటి పారుదల, బహుళార్థ సాధక ప్రాజెక్టుల అంచనా ఖర్చు దాదాపు రూ. 887 కోట్లు. ద్వితీయ ప్రణాళి కలో చేర్చబడిన ప్రాజెక్టుల అంచనా ఖర్చు తొలి ప్రణాళిక ఖర్చులో సగం మాత్రమే. తొలి ప్రణా ళికలో ఖర్చు రూ. 410 కోట్లు. దేశంలో సరిపడ ఆహారం వుత్పత్తి అయే వరకూ యితర విభాగాలలో ఖర్చును తగ్గించి నీటిపారుదల ప్రాజెక్టుల పై ఖర్చును హెచ్చించాలి. ఆ విధంగా యిదివరకే చేపట్టిన పథ కాలను పూర్తి చేయుటేకాక అవసరమైతే కొత్త వాటిని చేపట్టాలి కూడా.

ప్రస్తుత పరిస్థితులలో పోచంపాడు ప్రాజెక్టు తొలి అంచెకి కూడా పెట్టుబడిని రాష్ట్ర ప్రణాళిక నీటి పారుదల, విద్యుచ్ఛక్తి లేక యితర విభాగాల నుంచి సర్దుబాటు మూలకంగా సంపాదించవలసి వుంటుంది. కాని దీనివల్ల యెక్కువ ప్రయోజనం వుండదు. ధరలు పెరిగిపోతున్నాయి. ఎంతో పొదుపుగా వాడుకుంటే తప్ప యీ ప్రాజెక్టుకి కేటాయించబడగలసొమ్ముతో యెక్కువ పనిజరగదు. ఈ ప్రాజెక్టు ప్రతి దశలోను ప్రజలు సహకరించి పని చేస్తేనే పొదుపు సాధ్యం కాగలదు.

బ్రిటిష్ ఇంజనీర్లు బొంబాయి రాష్ట్రంలో గోదావరి ప్రారంభ భాగంలోను, అప్పటి మద్రాసు రాష్ట్రంలో గోదావరి చివరి భాగంలోను అత్యంత లాభదాయకమైన పనులను నిర్వహించారు. బ్రహ్మాండమైన పోచంపాడు ప్రాజెక్టు అట్టివారి దృష్టి పథంలో పడకుండా వుండివుండదు. అయితే 700 మైళ్లకి పైగా వున్ననది యీ మధ్య భాగం అప్పుడు నైజాం రాష్ట్రంలో వుండేది. ఆ పైన గొప్ప ఇంజనీరైన నవాబ్ ఆలీనవాజ్ జంగ్‌కి పూర్వం రాష్ట్రంలో పనులను ప్రారంభించుటకు ప్రసిద్ధులైన

భారతీయ ఇంజనీర్లు లేరు. అప్పుడు వదలి వేయబడిన పనిని యిప్పుడు పూర్తి చేయవలసివుంది. గోదావరి మహాలోయ యీ చివర ఆ చివరే కాక తెలంగాణా లోని మధ్య భాగంలో కూడా నందన వనంగా వుండాలి. అందుకు పోచంపాడు ప్రాజెక్టు వృత్త మొత్తంగా తోడ్పడుతుంది.

వంద సంవత్సరాల క్రితం గోదావరి డెల్టా వలెనే యిప్పుడు యీ ప్రాజెక్టు వల్ల తెలంగాణా అభివృద్ధి చెందుతుంది. గోదావరి డెల్టా అభివృద్ధికి సంబంధించిన వివరాలు యివి: "గోదావరి జిల్లా నిర్లక్ష్యం చేయబడిన రాష్ట్రంలో ఒక భాగం. కరువు వల్ల అక్కడ జనసంఖ్య తక్కువగా వుండేది. అక్కడ [illegible]దార్ల పరిపాలన సాగేది. అయితే ప్రశంసనీయమైన నీటి పారుదల [illegible] ప్రవేశ పెట్టడంతో అక్కడి పరిస్థితులు బాగుపడ్డాయి. అక్కడి ప్రజలకు కరువు అంటే యేమిటో తెలియదు. వారు సిరిసంపదలు కలిగి సంతృప్తిగా జీవిస్తున్నారు. ఆదాయ పరిస్థితులు చక్కబడి ఆదాయం హెచ్చింది. జనసంఖ్య రెండు రెట్లకి మించి పెరిగింది. ప్రజలు అతః పూర్వం కంటె చక్కని ఆహారాన్ని భుజించి, మంచి బట్టలు కట్టుకుని, బాగా చదువు కుని సుఖంగా వున్నారు. అక్కడి వాణిజ్య వ్యాపారాలు బ్రహ్మాండంగా అభివృద్ధి చెందాయి."

తెలంగాణా అభివృద్ధి కేమి, మొత్తం మీద దేశాభివృద్ధి కేమి నీటి పారుదల సౌకర్యాలు అత్యవసర మని చూపబడింది. అట్టి సౌకర్యాలు పొందుటకు అక్కడి భూమి తగివున్నది. వాటిని పొందుటకు ప్రజలు కూడా ఆతుర పడుతున్నారు. అందువల్ల పోచంపాడుకి గోదావరిలోయ ప్రాజెక్టులలో ముందు ప్రాధాన్యత యివ్వాలి. గోదావరిపై నీటి నిలవకై జలాశయాల్ని నిర్మించి వర్షాకాలం తరువాత నీరు దొరకని కాలంలో రైతులకు నీటిని అందించి ఆవిధంగా వారి పంటలు నష్టం కాకుండా తోడ్పడాలని సర్ ఆర్థర్ కాటన్ కలలు గన్నాడు. ఆ కలలను మనం యీనాడు సిద్ధింప జేసుకోవాలి. సర్ ఆర్థర్ కాటన్ గొప్ప ఇంజనీరు. మహత్కార్యాన్ని సాధించి ప్రజలకు యెంతో మేలు చేశాడు. మన ప్రస్తుత కార్య సాధనలో ఆయన సృజించిన గోదావరి డెల్టా మనకు ఆదర్శం కావాలి.

కావేరీ నదిపై యిప్పుడు కృష్ణరాజసాగర్ ఆనకట్టవున్న ప్రదేశంలో ఆనకట్టను నిర్మించాలని 1794 లో టిప్పు సుల్తాను ప్రయత్నించాడు. అప్పుడు ఆయన ప్రదర్శించిన విశ్వాసాన్నే మనము ప్రదర్శించాలి. "ఆరంభించడంనావంతు. అది పూర్తి కావడం భగవంతుని మీద ఆధార పడివుంది."

(ఒక ప్రసంగంనుంచి సంక్షిప్తం)



# నాగార్జునసాగర్ ప్రాజెక్టు క్రింద వ్యవసాయ, ఆర్థిక పరిస్థితుల సర్వే కార్యక్రమం

నాగార్జునసాగర్ ఆనకట్ట నిర్మాణం వల్ల ఏఏ ఆర్థిక ప్రయోజనాలు లభించగలవో పరిశీలించే ఉద్దేశంతో, విచారణ ప్లానులు పూర్తిఅయిన తర్వాత సాధ్యమైనంత త్వరలో, నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఆయకట్టు ప్రాంతంలో వ్యవసాయ, ఆర్థిక పరిస్థితుల సర్వే కార్యక్రమం నిర్వహించాలని ప్రాజెక్టు అభివృద్ధి సంఘం ప్రథమ సమావేశంలో నిర్ణయం జరిగింది. విచారణ ప్రణాళికను రూపొందించే విషయంలో, భారత వ్యవసాయ పరిశోధన సంస్థ, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, గోఖలే రాజకీయ, ఆర్థిక సంస్థ, ఆంధ్ర విశ్వవిద్యాలయం మున్నగు సంస్థల ప్రతినిధులతోనూ, యింకా యితరులతోనూ సంప్రదింపులు జరిగినవి. సర్వే కార్యక్రమాన్ని వివరాలతో సహా తయారు చేయటానికీ, ఆయా సమయాలలో సర్వే పనులను పరిశీలిస్తూ వాటిని నడప టానికీ సాంకేతిక సంఘం ఒకటి ప్రత్యేకంగా ఏర్పాటు చేయ బడింది.

సర్వే కార్య క్రమాన్ని రెండుభాగాలుగా విభజించాలనీ, కేవలం వ్యవసాయ పరిస్థితుల విచారణ ఒక భాగంలోనూ, సాంఘిక, ఆర్థిక పరిస్థితుల విచారణ రెండవ భాగంలోనూ జరిపించాలనీ నిర్ణయించ బడింది. అభివృద్ధి సంఘం ద్వారా కంట్రోలు బోర్డువారు యీ విచారణలకు పరస్పర సమన్వయం కల్పిస్తారు. వ్యవసాయ పరిస్థితుల విచారణ ప్రణాళికను సిద్ధంచేయటానికీ, ఆయా సమయాలలో అవసరమయ్యే సాంకేతిక మార్గ దర్శకత్వం వహించటానికీ భారత వ్యవసాయ పరిశోధన సంస్థ అంగీకరించింది. సాంఘిక, ఆర్థిక పరిస్థితుల విచారణ భాగాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం నిర్వ హిస్తుంది.

భూమి వినియోగము, వివిధ పంటల క్రింద, యేయే వ్యవసాయ పద్ధతులపై అంటే మామూలు ఎరువులు, రసాయనిక ఎరువుల వాడకం, పంటల రకాలు వగైరా విషయాలలో ఎంతెంత భూమి సాగవు తున్నది, వ్యవసాయ కమతాలు, యాజమాన్యపు కమతాల విస్తీర్ణం వివరాలు, ఆ ప్రాంతంలోని ముఖ్య పంటలలో లభిస్తున్న దిగుబడి రేటు, అక్కడి ముఖ్యమైన పంటల వ్యవసాయ ఖర్చులు, పశుగణ వివరాలు, పశుపోషణ పద్ధతులు మొదలగు అంశాల ఆధారంతో. ఆ ప్రాంతంలో జరుగుతున్న వ్యవసాయాభి వృద్ధిని అప్పు డప్పుడు నిర్ణీత వ్యవధిలో పరిశీలించటమే యీ సర్వే కార్యక్రమం యొక్క ప్రధానోద్దేశము. ఈ సర్వే పరిశీలన ఫలితంగా, యీ ప్రాంతంలో సేద్యపు నీటి పారుదల విషయాలలో అభివృద్ధి కరమైన మార్పులను, యంత్ర సహాయంతో భారీ యెత్తున జరిగే వ్యవసాయ పద్ధతులను త్వరగా ప్రవేశ పెట్టటానికీ, వ్యవసాయ పరిశ్రమలను అను వైన ప్రదేశాలలో స్థాపించు కోటానికీ చక్కని అవకాశం లభిస్తుంది.

## సంఖ్యా వివరాల సేకరణ

భూమి యాజమాన్యము, వ్యవస్థా స్వరూపము, పెట్టుబడి, జీవనోపాధి, ఉత్పత్తి, మార్కెటింగ్, లాభాలు, వినియోగము, గ్రామీణ ప్రాంతాలలోని వ్యవసాయేతర కుటుంబాల స్వరూపము, పట్టణ ప్రాంతాలలో పరిశ్రమలు, వర్తక వాణిజ్యాలు, రవాణా, ఉద్యోగాలు మొదలగు విషయాలలో ప్రస్తుత పరిస్థితులు, స్థానిక సంస్థల, రాష్ట్ర ప్రభుత్వపు ఆదాయ, వ్యయాలు మున్నగు అంశాలను గురించి

ప్రాతిపదిక సంఖ్యావివరాలను సేకరించటం సాంఘిక, ఆర్థిక పరిస్థితుల సర్వే కార్యక్రమం యొక్క లక్ష్యము.

ఆవిధంగా సేకరించిన సంఖ్యా వివరాల వల్ల ప్రాజెక్టు ప్రాంతంలోని ప్రస్తుత పరిస్థితుల యొక్క యదార్థ చిత్రణ లభిస్తుంది. ఈ పరిస్థితులతో, ప్రాజెక్టు నిర్మాణానంతరం ఏర్పడే కొత్త పరిస్థితులలో కలిగే అభివృద్ధిని అప్పు డప్పుడు పోల్చి చూసుకోటానికి అవకాశం కూడా ఏర్పడుతుంది. ప్రజల సాంఘిక ఆర్థిక జీవితరంగాలలో ఏవిధమైన అభివృద్ధి ఎంతవరకు సాధించ బడినదో తెలుసు కొనుటకే కాక, ఆర్థికా భ్యుదయానికి యీ ప్రాజెక్టు నిర్మాణం ప్రత్యక్షంగా ఎంత వరకు దోహదం చేసిందోకూడా ఈ సర్వే వల్ల గ్రహించటానికి వీలుంటుంది. యిదేసందర్భంలో, ఒకానొక పద్ధతిలో అభ్యుదయ కరంగా ముందుకు సాగుతున్న సమయంలో ఏయేశక్తులు ఏవిధంగా అడ్డంకులు కలిగించునో కూడా అంచనా వేసుకోవచ్చు.

సాంఘిక, ఆర్థిక పరిస్థితుల సర్వే జరిపించటానికి సుమారు 30 గ్రామాలను ఎంచుకోవాలని ప్రతిపాదన జరిగింది. పండుతున్న పంటలనుబట్టి, అంటే వ్యాపార పంటలు, మెట్ట పంటలు, మాగాణి పంటలు మొదలగు వివిధ రకాల ననుసరించి ఈ సర్వే గ్రామాల ఎన్నిక జరుగుతుంది. అదే విధంగా సుమారు 100 గ్రామాలలో వ్యవసాయ పరిస్థితుల సర్వే కార్యక్రమం అమలు పరచ బడుతుంది. వ్యవసాయంమీద ఆధార పడిన జనాభా, ఆయా ప్రదేశాలలోని నేల రకాలు, భూమిసాగు విస్తీర్ణం మొదలగు విషయాల ననుసరించి ఈ 100 గ్రామాలను ఎన్నుకుంటారు:

ఈ రెండు రకాల సర్వే కార్యక్రమానికి రు 5.5 లక్షలు ఖర్చు జరుగు తుందని అంచనా. గ్రామాల ఎన్నిక మొదలగు సర్వే ప్రాథమిక కార్యక్రమాలు జరుగుతున్నవి. త్వరలోనే అవి తుదిస్వరూపం ధరించగలవు.





రాష్ట్ర రెవిన్యూ శాఖామంత్రి భూకమతాల గరిష్ఠ పరిమితి బిల్లునుగురించి పత్రికా ప్రతినిధులకు వివరిస్తున్నారు

# భూకమతాలకు గరిష్ఠ పరిమితి

**ఆంధ్ర ప్రదేశ్‌లోని భూకమతాలకు గరిష్ఠ పరిమితి విధించ నుద్దేశిస్తున్న 1958 సం॥పు ఆంధ్రప్రదేశ్ భూకమతాల గరిష్ఠ పరిమితి విధింపు బిల్లును ప్రభుత్వం ప్రకటించింది. ఈ బిల్లులోని ప్రధానాంశాలు దిగువ వివరించ బడినవి.**

యిప్పటి భూకమతాల మీదా, మున్ముందుజరిగే వ్యవసాయ భూముల సేకరణ మీద కూడా గరిష్ఠ పరిమితి విధించటానికి యీ బిల్లు ఉద్దేశిస్తున్నది. వ్యవసాయ భూములు అనే పదంలో వ్యవసాయానికీ ఉద్యానకృషికీ, వినియోగించబడుతున్న, లేక వినియోగించటానికి వీలైన అన్ని భూములు చేరి వుంటవి. కాని కేవలం వ్యవసాయేతర ప్రయోజనాలకు మాత్రమే వినియోగింపబడుతున్న భూములు యిందులో చేరవు.

సమిష్టి హిందూ కుటుంబాలు, కంపెనీలు,సంస్థలు, సొసైటీలు లేక సంఘాలతోసహా అందరు వ్యక్తులకు యీ గరిష్టపరిమితి వర్తిస్తుంది. అయితే రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు, మత, ధర్మ, విద్యా సంస్థలు ప్రభుత్వ మోదము పొందిన సహకార వ్యవసాయ సంఘాలకు గరిష్ఠపరిమితి వర్తించదు.

ఒక వ్యక్తియొక్క భూకమతములో పూర్తిగానూ లేక పరిమితంగానూ అతనికి స్వామిత్వంగల భూములు, అనుభవ మాత్రాధికారం గల తాకట్టు భూములు, కౌలుభూములు, లేక యింకా ఏదైనా హక్కుతోగానీ లేక అటువంటి అన్ని హక్కులతోనూ వున్న భూములన్నీ చేరుతవి. సమిష్టి హిందూ కుటుంబ సభ్యుని కమతములో, అతనికి వ్యక్తిగతంగా వుండే భూములు, కుటుంబ సభ్యులు వేరుపడిన యడల అతనికి లభించే వాటాభూములు చేరుతవి.

## ప్రస్తుత భూకమతాలు

సాలుకు రూ. 5400ల నికరాదాయం లభించే భూమి, విస్తీర్ణం యిప్పటి కమతాలకు గరిష్ఠ పరిమితిగా వర్తింపజేయబడుతుంది. నికరాదాయం, మొత్తం ఆదాయంలో సగంగా లెక్కించబడుతుంది. గత పది సంవత్సరాల కాలంలోని సగటు ధరల దృష్ట్యా మొత్తం ఆదాయం అంచనా వేయబడుతుంది.

కుటుంబం వేరుపడినప్పుడు, హిందూన్యాయ శాస్త్రం ప్రకారం కుటుంబ ఆస్తిలో వాటా హక్కు కలిగినట్టి సభ్యులు అయిదుగురి కంటే ఎక్కువ మంది గల సమిష్టి హిందూ కుటుంబం విషయంలో గరిష్ఠ ఆదాయం సాలుకు రూ. 5400లు కాక, అయిదుగురికి మించి ఎంతమంది సభ్యులున్నారో, ఆ అదనపు సభ్యులకు ఒక్కొక్కరికి రూ. 1200ల చొప్పున అదనంగా గరిష్ఠపరిమితి అనుమతించబడుతుంది. గరిష్ట పరిమితి నిర్ణయంలో, రాష్ట్రంలోని వివిధ ప్రదేశాలలోని వ్యవసాయ పరిస్థితులు పరిగణించబడుతవి; ప్రతి స్థానిక ప్రాంతానికి అక్కడి భూమి సారాన్ని బట్టి, నేలల రకాలను బట్టి మామూలు పరిస్థితులలో సాలుకు రూ. 5400ల నికరాదాయాన్ని అంటే గరిష్ట ఆదాయాన్ని సాధించటానికి ఎంత విస్తీర్ణం అవసరమో, నిర్ణయించి ప్రకటించబడుతుంది. ఆ విధంగా నిర్ణయించి, ప్రకటించిన భూమి విస్తీర్ణం "అనుమతించదగిన భూకమత" ప్రమాణం అని వ్యవహరించబడుతుంది.

"అనుమతించదగిన భూకమతం" వరకు ఏ వ్యక్తి అయినా భూమిని వుంచుకోవచ్చు. ప్రకటించబడిన తేదీనాటికి అంతకు మించిన భూమిగల ప్రతివారూ, ఆ తేదీనుండి 90 రోజులలోగా, స్థానిక రివిన్యూ డివిజనల్ ఆఫీసర్ కు తమ భూకమతం వివరాలను తెలుపవలసి వుంటుంది. ఆకమతం నుండి ఖచ్చితంగా ఎంత నికరాదాయంవచ్చేదీ రివిన్యూడివిజనల్ ఆఫీసర్ నిర్ణయిస్తాడు. గత 3 సంవత్సరాలలో ఆ భూములలో పండినపంటల దిగుబడి మీదనూ, గత 10 సంవత్సరాల కాలంలోని సగటు ధరలమీదనూ ఆధారపడి రివిన్యూ డివిజనల్ ఆఫీసర్ ఆకమతం నికరాదాయాన్ని నిర్ణయించటం జరుగుతుంది. తోటలు పెంచిన భూములకూ, పశువుల మేతకు ఉపయోగించే భూములకూ, ఆదాయాన్ని నిర్ణయించే సందర్భంలో సదరుభూములలో పైన పేర్కొన్న మూడేండ్ల కాలంలో స్థానిక వ్యవసాయ పద్ధతులపై మామూలు పంటలు పండిస్తే ఎంత ఆదాయం లభించి వుండేదో, ఆ మొత్తమే లెక్కలోనికి తీసుకోబడుతుంది.

ఈ విధంగా రివిన్యూ డివిజనల్ ఆఫీసర్ నిర్ణయించిన నికరాదాయం గరిష్ఠ ఆదాయానికి సమంగాగానీ, లేక అంతకు తక్కువగా గానీ వుంటే, ఆవ్యక్తి తనభూముల నన్నింటినీ వుంచుకోవచ్చు. నికరాదాయం గరిష్ఠ ఆదాయానికి మించివున్నట్లయితే, సదరుకమతంలో నుండి ఎంత విస్తీర్ణం భూమిని తీసివేస్తే, మిగిలిన భూమిపై వచ్చే నికరాదాయం "గరిష్ఠ ఆదాయానికి" సమమవుతుందో అంతభూమిని యిచ్చి వేయవలసివస్తుంది. అయితే ఏ పరిస్థితులలోనూ, అతనికి మిగిలేభూమి "అనుమతించదగిన భూకమత" ప్రమాణానికి తగ్గునట్లుగా భూమిని వదలుకొమ్మని అతనిని కోరటం జరుగదు.

ఒక భూఖామందు యిచ్చిన భూమిని రొఖ్ఖరూపంలోగానీ, బాండ్లరూపంలోగానీ లేక కొంత రొఖ్ఖం, కొంత బాండ్లరూపంలోగానీ నష్టపరిహారం చెల్లించి ప్రభుత్వం స్వాధీన పరచుకుంటుంది. నష్టపరిహారం, యిచ్చిన భూమియొక్క నికరాదాయానికి కొన్ని రెట్లు వుంటుంది. నష్టపరిహారం, నికరాదాయానికి అంచెలవారీపద్ధతిపై 10 నుండి 5 రెట్లవరకు వుంటుంది. యిందులో ఒక సంవత్సరపు నికరాదాయం, కౌలుదారువుంటే, అతనికీ, మిగిలినది భూఖామందుకూ చెల్లించ బడుతుంది. భూఖామందుకు సదరు భూమిపై పరిమిత హక్కు మాత్రమే వుంటే, అతడు విడుదల చేసిన భూమి, దానిపై ఉత్తరాధికారి ఎవరిని వూహించబడుతున్నదో వారికి చెందుతుంది. అట్టి ఉత్తరాధికారి సదరు భూమికి చెల్లించ దగిన నష్టపరిహారములో 5వ శాతమునకు సమానమగు మొత్తమును ఏటేటా, భూమి విడుదల చేసిన పరిమితాధికారికి చెల్లించవలసి వుంటుంది. విడుదలైన యీ భూమి విస్తీర్ణం, ఉత్తరాధికారి యొక్క భూకమతానికి కలుస్తుంది. ఆ విధంగా కలసినందు

వల్ల, ఆ ఉత్తరాధికారి యొక్క భూకమతం అనుమతించ దగిన భూకమత ప్రమాణాన్ని మించి, గరిష్ఠ ఆదాయ పరిమితికి మించిన ఆదాయమును యివ్వగలిగితే, అతడుకూడా అదనపు భూమిని విడు దల చేయవలసి వుంటుంది. అనుభవ మాత్రాధికారం గల తాకట్టుదారు విడుదల చేసిన భూమి విషయంలో, ఆభూమి పై స్వాధీనపుహక్కు, తాకట్టు పెట్టిన వారికి తిరిగి సంక్రమిస్తుంది. తాకట్టు బాకీ తీర్చవలసిందని వారు కోరబడతారు. ఒక కౌలుదారు విడుదలచేసిన భూముల విషయంలో, భూమి స్వాధీ నపుహక్కు భూఖామందుకు సంక్రమిస్తుంది. భూఖా మందు కౌలుదారుకు ఒక సంవత్సరపు నికరా దాయాన్ని నష్టపరిహారంగా చెల్లించవలసి వుంటుంది.

## మున్ముందు భూముల సేకరణ

భవిష్యత్తులో భూములను సేకరించే విషయంలో నిర్ణీతగరిష్ఠపరిమితి సాధారణంగా, యిప్పటి భూక మతాలకు వర్తించు పరిమితిలో 2/3 వంతులు వుంటుంది. అంటే మామూలుగా సాలుకు రూ3,600లు నికరాదాయం యివ్వగల భూమి విస్తీర్ణం అన్న మాట. దీని ప్రకారం, యికముందు ఏ వ్యక్తినీ గానీ, అతనికి గల మొత్తము భూమి "అనుమ తించదగిన భూకమతం"లో 2/3 వంతులకు మించునట్లుగా భూమి కొనటానికి గానీ, స్వేచ్ఛగా సేకరించటానికి గానీ, కౌలుకు తీసు కోటానికిగానీ తాకట్టు పెట్టించుకోటానికిగానీ అను మతించటం జరుగదు. యీ నిబంధన నుల్లంఘించి, ఏ వ్యక్తి అయినా పైనపేర్కొన్న పరిమితికి మించిన భూమిని సేకరించినట్లైతే, ఆ భూమిమీద అతనికిగల అన్ని హక్కులు ఏ విధమైన నష్టపరిహారం చెల్లించ బడకుండానే, ప్రభుత్వానికి సంక్రమించగలవు. మున్ముందు వారసత్వం వల్లగానీ, ప్రయత్నరహితంగా యితర మార్గాల ద్వారాగానీ భూమిలభించి, అందు వల్ల అతనియొక్క మొత్తం భూకమతము "అను మతించదగిన భూకమత" ప్రమాణానికి మించి నట్లైతే, నిర్ణీత కాలంలోగా ఆ విషయాన్ని అతడు తెలియజేయవలసి వుంటుంది. అప్పటినుండి అతని భూములకు, యిప్పటి భూకమతాలకు నిర్ణయించిన గరిష్ఠ పరిమితి వర్తిస్తుంది.

## పచ్చిక బీళ్లకు ప్రత్యేక నిబంధన

నిర్ణీత గరిష్ఠ పరిమితి కాక, ఏవ్యక్తి అయినా అదనంగా గరిష్ఠ పరిమితి విస్తీర్ణంలో 3వ వంతు భూమిని పచ్చిక బీళ్ళ క్రింద వుంచుకోవచ్చు. లేక సేకరించుకోవచ్చు.

## పంచదార ఫ్యాక్టరీల క్రిందగల భూములు

10-6-1950 తేదీనుండి, అంటే హైదరాబాద్ కౌలుదారీ, వ్యవసాయ భూముల చట్టం అమల్లోనికి వచ్చిన నాటినుండి పంచదార ఫ్యాక్టరీల యాజ మాన్యంలో వుంటూ, ఫ్యాక్టరీ కొరకు చెరకు పండించ బడుతున్న ఏ భూమికూడా విడుదల చేయ మని కోరటం జరుగదు.

## తెలంగాణాలోని రక్షిత కౌలుదార్లకు ప్రత్యేక నిబంధనలు

ప్రస్తుతం, కొన్ని షరతులకు లోబడి, తెలంగాణా ప్రాంతంలోని రక్షిత కౌలుదారు తన స్వాధీనంలో గల భూమిని, భూఖామందు వద్దనుండి ఒక కుటుంబ కమతం పరిమితి వరకు కొనుక్కోవచ్చు. ఈ పరిమితి యికమీద తొలగించ బడుతుంది. అప్పుడు, భూఖామందు స్వయంగా వ్యవసాయం చేయుటకై కేటాయించు కున్న భూమి తప్ప, కౌలుదారు తన స్వాధీనంలో గల భూమినంతనూ కొనుక్కోవచ్చు. ఈ కొను గోలుకూడా, భవిష్యత్తులో భూముల సేకరణకు విధించ బడిన గరిష్ఠ పరిమితికి లోబడి వుంటుంది. రక్షిత కౌలుదారు వద్ద అదనపు భూమి ఏమైనా వుంటే, దానిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది. యిందుకుగాను ప్రభుత్వం చెల్లించే నష్టపరిహారం, భూఖామందు, రక్షితకౌలుదార్లకు 2 : 3 నిష్పత్తిలో చెందుతుంది.

## ఇతర విశేషాలు

1950 సం॥పు. హైదరాబాద్ కౌలుదారీ, వ్యవ సాయ భూముల చట్టం అమలు పరచుటలో కలిగిన కొన్ని యిబ్బందులను నివారించుటకై త్వరలోనే

యీ చట్టాన్ని సవరిస్తూ ఒకబిల్లు తేవాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. అంతేకాక యీ చట్టంలోని 47వ సెక్షను క్రింద కలెక్టరు వద్దనుండి ముందుగాఅనుమతి పొందకుండానే, తెలంగాణా ప్రాంతంలో చట్ట విరుద్ధంగా జరిగిన కొన్ని అన్యాక్రాంతాలను కొన్ని షరతులకు లోబడి, చెల్లునట్లు చేయాలనికూడా ప్రభుత్వం సంకల్పించింది. ప్రస్తుతం తెలంగాణాలో అమల్లోఉన్న 1950 సం. పు హైద్రాబాద్ కౌలుదారీ, వ్యవసాయభూముల చట్టంలోని నిబంధనలకూ ఆంధ్ర ప్రాంతంలో అమల్లోగల 1956 సం.పు ఆంధ్ర కౌలుదారీ చట్టములోని నిబంధనలకూ బదులుగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటికీ వర్తించు కౌల్దారీ శాసనము సాధ్యమైనంత త్వరలో చేయాలనికూడా సంకల్పం. 1956 సం. పు. హైద్రాబాద్ కమతాల ఖండీకరణ నివారణ, కమతాల స్థిరీకరణ చట్టమును తగు మార్పులతో ఆంధ్రప్రాంతానికి కూడా వర్తింప జేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. వ్యవసాయం సామర్థ్యంతో నిర్వహించుట, భూమి సక్రమ నిర్వహణ, సహకార వ్యవసాయం మున్నగు విషయాలను గురించి ప్రత్యేకమైన, సమగ్రమైన శాసనం చేసే విషయంకూడా ఆలోచనలో వుంది. భూదాన, గ్రామదానోద్యమాలకు సంబంధించి సమగ్రమైన రూపంలో త్వరలోనే శాసనం తయారుచేయబడుతుంది. మద్రాసు ఎస్టేట్ల రద్దుచట్టం క్రింద, రద్దుఅయిన ఎస్టేట్ల భూఖాందులకు నష్టపరిహారాన్ని బాండ్ల రూపంలో చెల్లించుటకు అనుమతించే శాసనం కూడా ఆలోచనలో వున్నది.



ఆంధ్రప్రదేశ్ జిల్లాలు:

# కర్నూలు

కర్నూలు రాయలసీమ జిల్లాల్లో ఒకటి. అది ఆర్థికంగా, సాంఘికంగా వెనకబడివుంది. దానికి వుత్తరాన మహబూబునగరం, గుంటూరు జిల్లాలు, తూర్పున గుంటూరు, నెల్లూరు జిల్లాలు, దక్షిణాన అనంతపురం, కడపజిల్లాలు, పశ్చిమాన బళ్లారిజిల్లా వున్నాయి. దానికి ఒక నిర్ణీతమైన స్వరూపం లేదు.

ఈ జిల్లా విస్తీర్ణం 9215 చ. మైళ్లు. జనసంఖ్య 16.19 లక్షలు (13.88 లక్షలు గ్రామీణులు. 2.81 లక్షలు పట్టణవాసులు). ఈజిల్లాలో 1066 గ్రామాలు, 17 పట్టణాలు వున్నాయి. ఈ జిల్లాలో దిగువ పేర్కొనబడిన రెవిన్యూ డివిజన్లు 4 వున్నాయి. వాటిలో 11 తాలూకాలు, 2 సబ్-తాలూకాలు వున్నాయి.

| రెవిన్యూ డివిజన్ | ముఖ్యపట్నం | ఆ డివిజన్‌లోగల తాలూకాల పేర్లు |
|---|---|---|
| 1. కర్నూలు | కర్నూలు | కర్నూలు, నందికొట్కూరు, ధోన్. |
| 2. ఆదోని | ఆదోని | పత్తికొండ,ఆదోని, ఆలూరు. |
| 3. నంద్యాల | నంద్యాల | నంద్యాల,కోయిల్‌కుంట్ల, సిర్వేల్,బనగానపల్లి (సబ్-తా) |
| 4. మార్కాపురం | మార్కాపురం | మార్కాపురం, కంభం, ఆత్మకూరు (సబ్-తా). |

## నైసర్గిక స్వరూపం

ఈ జిల్లాను భౌగోళికంగా మూడు సమవిభాగాలుగా విభజించవచ్చు. అవి ఆవిధంగా నల్లమల, యెర్రమల కొండల ద్వారా విభజిత మవుతున్నవి. తూర్పు విభాగంలో మార్కాపురం, కంభం తాలూకాలు వున్నాయి. అక్కడ వర్షాలు ఈశాన్య ఋతు పవనాల వల్ల కురుస్తాయి. ఇక్కడ కొంతభాగంలో తక్కువ వర్షాలవల్ల ప్రజలు యిబ్బంది పడతారు. అయితే యీ కొరతను తీర్చుటకు కొన్ని ప్రదేశాలలో చాల బావులు వున్నాయి. పై రెండుకొండల శ్రేణుల మధ్యనున్న మధ్య విభాగంలో కోయిల్‌కుంట్ల, సిర్వేల్, నంద్యాల. నందికొట్కూరు తాలూకాలు, ఆత్మకూరు, బనగానపల్లి సబ్-తాలూకాలు వున్నాయి. ఇది యీ జిల్లాలో సారవంతమైన ప్రదేశం. ఇక్కడి భూములకు నీరు కర్నూలు-కడప కాలవద్వారా లభిస్తుంది. మూడవది పశ్చిమ విభాగం. ఇందులో కర్నూలు, ధోన్, పత్తికొండ, ఆలూరు, ఆదోని తాలూకాలు వున్నాయి. వీటిలో మొదటి 3 తాలూకాలలోను సర్వత్రా చిన్న చిన్న కొండగుట్టలు వ్యాపించి వున్నాయి. వాటి పై మొక్కలు మొదలైనవి యెక్కువ పెరగవు.

## కొండలు

నల్లమల, యెర్రమల కొండలు, వెలిగొండ యివి యీ జిల్లాలో ముఖ్యమైన కొండలు. నల్లమల కొండలు దక్షిణంనుంచి వుత్తరానికి యించుమించు 70 మైళ్ల పొడుగున వ్యాపించి వున్నాయి. వృక్షజాలం విషయంలోనేమి, ప్రకృతి దృశ్యాల విషయంలోనేమి అరణ్యం బహురమణీయంగా వుంటుంది. ఈ కొండల సరాసరి యెత్తు 2000 అడుగులు. వీటిలో 3000 అడుగుల యెత్తుకు మించిన శిఖరాలు అనేకం వున్నాయి.

ఎర్రమల కొండల శ్రేణిధోన్, కర్నూలు తాలూకాల తూర్పు ప్రాంతాలలోను, కోయిల్‌కుంట్ల,



శ్రీ సి. పి. తిమ్మారెడ్డి
(ఆళ్ల గడ్డ)

# ఈ జిల్లానుంచి ఎన్నికయిన వారు.



శ్రీ మహబూబు అలీఖాన్,
శా.స. (కర్నూలు)



శ్రీ డి. సంజీవయ్య
(ఎమ్మిగనూరు)



శ్రీ రామలింగారెడ్డి
(ఆలూరు)



శ్రీ బి. పి. శేషారెడ్డి
(ధోన్)



శ్రీ పిడతల రంగారెడ్డి
(గిద్దలూరు)



శ్రీ టి. జి. తిమ్మయ్యసెట్టి
(కోసిగి)



శ్రీ జి. బుస్సన్న (ఆదోని)

సంద్యాల, బనగానపల్లి తాలూకాల పశ్చిమ ప్రాంతాలలోను వ్యాపించి వుంది.

వెలిగొండ శ్రేణి కంభం తాలూకా తూర్పు చివరనుంచి వ్యాపించి మార్కాపురానికి తూర్పున 10 మైళ్ల దూరంలో ఆఖరవుతుంది

## నదులు

కృష్ణా, తుంగభద్ర, హంద్రి, కుందు, గుండ్లకమ్మ, సాగిలేరులు యీ జిల్లా ముఖ్య నదులు

## అడవులు

జిల్లా విస్తీర్ణంలో యించుమించు 29 శాతం మాత్రమే అడవుల క్రింద వున్నది రిజర్వు అడవుల విస్తీర్ణం 2619 30 చ.మైళ్లు ఎస్టేటు అడవుల విస్తీర్ణం 37 26 చ. మైళ్లు.

## శీతోష్ణస్థితి

ఈ జిల్లాలో ఏప్రిల్, మేనెలల్లో యెండలు మిక్కిలి యెక్కువ. ఈ జిల్లాకు రెండు ఋతుపవనాల వల్లనూ వర్షం కురుస్తుంది. నైఋతి ఋతుపవనాలవల్ల యెక్కువ వర్షం లభిస్తుంది. జిల్లా సగటు వర్షపాతం 24.2 అం. ధోన్ తాలూకా దక్షిణ భాగంలోను, నంది కొట్కూరు తాలూకా ఈశాన్య దిక్కున గల శ్రీశైలం సమీపంలోను యెత్తైన ప్రదేశాలలో చల్లగా వుంటుంది. నల్లమల కొండలలో యెత్తైన ప్రదేశాలలో కూడా చల్లగా వుంటుంది.

## భూమి

తూర్పు విభాగంలో సారవంతం కాని ఎరుపు భూమి యెక్కువ. మధ్య విభాగంలో రేగడి భూమి అధికం. మళ్లీ పశ్చిమ విభాగంలోని పత్తికొండ, ధోన్ తాలూకాలలో సారవంతం కాని భూమి యెక్కువకాగా అదే విభాగంలోని కర్నూలు తాలూకా, పత్తికొండ తాలూకా కొన్ని ప్రాంతాలలో రేగడ భూమి అధికం. ఆదోని, ఆలూరు తాలూకాలలో సారవంతమైన నలుపు యెరుపు, మిశ్రమరకాల భూములు కనబడతాయి.

## పంటలు

జొన్న, కొర్ర యీ జిల్లా ముఖ్య పంటలు. వరగు, సజ్జ, వరి పంటలు కూడా తగినంతగా పండించబడతాయి. శనగలు, ఫులవలు కూడా యెక్కువగానే పండించబడతాయి. ప్రత్తి, వేరుసెనగ, మిర్చి ముఖ్యమైన వాణిజ్యపంటలు.

## పరిశ్రమలు

గిన్నింగు ప్రెస్సులు, వేరుసెనగ పప్పులు తీసేవి, నూనె మిల్లులు తప్ప యీ జిల్లాలో చెప్పదగిన భారీ పరిశ్రమలు యేవీలేవు. పణ్యాం సిమెంటు ఫ్యాక్టరీ త్వరలోనే పని ప్రారంభిస్తుంది ఆదోనిలోని బట్టల మిల్లులు, కర్నూలులోని వనస్పతి మిల్లులు యీ జిల్లాలోని యితర భారీ పరిశ్రమలు. నూలు తివాసీలు, బట్టలు, వున్నికంబళ్లనేత యీ జిల్లాలోని ప్రధానమైన కుటీర పరిశ్రమ.

ఆదోని, కర్నూలులలో తయారయే నూలు తివాసీలు మంచి నాణ్యమయినవి. నూలు వస్త్రాలు మామూలు రకాలవే. అయితే ఎమ్మిగనూరు, కోడుమూరు, గూడూరులలో కొన్ని రకాల సిల్కు బట్టలు కూడా తయారవుతాయి. పత్తికొండ, ధోన్, కర్నూలు, నందికొట్కూరు తాలూకాలలోని కొన్ని గ్రామాలలో వేర్వేరు రకాల వున్ని కంబళ్లు తయారు చేయబడతాయి. మార్కాపురంలో పలకల తయారీ ప్రధాన పరిశ్రమ. కర్నూలులో బీడీల తయారీ యెక్కువగా సాగుతుంది.

కర్నూలులో వడ్రంగం, కమ్మరం పనులలో శిక్షణ యిచ్చే వుత్పత్తి - శిక్షణా కేంద్రాలు రెండు వున్నాయి. ఒక్కొక్క కేంద్రంలోను 12 మంది అభ్యర్థుల జట్టుకి 11 నెలల పాటు శిక్షణ యివ్వబడుతుంది. శిక్షితులలో ఒక్కొక్కరికి నెలకి రూ. 30/ స్టయిపెండు యివ్వబడుతుంది. ద్రోణాచలంలో పింగాణీ సరుకుల వుత్పత్తి శిక్షణా కేంద్ర ఒకటి ప్రారంభింపబడుతుంది. నంద్యాలలో రూ. 3.00 లక్షల ఖర్చుపై ఒక పారిశ్రామిక కేంద్రం యేర్పాటు చేయబడుతుంది.

## నీటిపారుదల

తుంగభద్రా ప్రాజెక్టు ద్వారా ఆలూరు, ఆదోని, పత్తికొండ. కర్నూలు తాలూకాలలో 1.56 లక్షల యెకరాలకు నీటిపారుదల లభిస్తుందని భావించబడుతున్నది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు ద్వారా మార్కాపురం తాలూకాలో స్వల్పమైన భూమికి నీటిపారుదల లభిస్తుందని భావన.

ప్రస్తుతం యీ జిల్లాలోని మిక్కిలి పెద్ద నీటి వనరు కర్నూలు-కడపకాలవ. అది కర్నూలుకు పశ్చిమాన 18 మైళ్లదూరంలోగల సుంకేశలవద్ద తుంగభద్రా నదినుంచి బయలుదేరి, కర్నూలు. నంది కొట్కూరు, నంద్యాల, సిర్వేల్, కోయిల్‌కుంట్ల తాలూకాలగుండా ప్రవహిస్తుంది. ఒకలక్ష యెకరాలకు నీటిపారుదల కల్పించడానికి యీ కాలవ వుద్దేశించబడింది. నాలుగు కోట్ల రూపాయలను వ్యయపరచి యీ కాలువను అభివృద్ధి పరిస్తే యిది మొత్తం 3 లక్షల యెకరాలకు నీటిని అందించగలదని భావించబడుతున్నది.

గిద్దలూరు తాలూకాలోని కంభం చెరువు, ఆత్మకూరు సబ్-తాలూకాలోని మార్కాపురం చెరువు, సిద్ధపురం చెరువు యీ జిల్లా చెరువులలో మిక్కిలి పెద్దవి.

ఈ జిల్లాలో 638 చిన్నరకం నీటి వనరులు మొత్తం 23,563 యెకరాలకు నీటిపారుదలను లభింపచేస్తున్నవి.

## తంతి, తపాలా కార్యాలయాలు

ఈ జిల్లాలో ఒక హెడ్ పోస్టాఫీసు, 21 సబ్-పోస్టు, టెలిగ్రాఫ్ ఆఫీసులు, 6 తపాల కార్యాలయాలు, 240 బ్రాంచీ పోస్టాఫీసులు వున్నాయి.

## రైలు మార్గాలు

ఈ జిల్లాలో 45 మైళ్ల బ్రాడ్ గేజ్ రైలు మార్గము, 170 మైళ్ల మీటర్ గేజ్ రైలు మార్గము వున్నాయి. బ్రాడ్ గేజ్ మార్గము మద్రాసు నుంచి బొంబాయి వరకూను, మీటర్ గేజ్ మార్గము మచిలీపట్నం నుంచి హుబ్లీవరకూను, దోర్నాచలం నుంచి సికిందరాబాదు వరకూను వున్నాయి. మొదటి రెండు దక్షిణ రైల్వేలోను, చివరిది సెంట్రల్ రైల్వేలోను వున్నవి. నందికొట్కూరు, కోయిల్‌కుంట్ల, సిర్వేల్ తాలూకాలలోను ఆత్మకూరు, బనగానపల్లి సబ్-తాలూకాలలోను రైలుమార్గము లేదు.

## మార్కెట్లు

నంద్యాల, ఆదోనిలలో ప్రసిద్ధమైన రెండు మార్కెట్లు వున్నాయి.

## యాత్రా కేంద్రాలు

కృష్ణానదీ తీరాన నల్లమల కొండల మీదనున్న శ్రీశైలదేవాలయం దేశంలో మిక్కిలి పురాతనమైన దేవాలయాలలో ఒకటి. అక్కడికి ముఖ్యంగా శివరాత్రి మహోత్సవంనాడు దేశంనలుమూలలనుంచి యాత్రికులు అసంఖ్యాకంగా వస్తారు. ఈ దేవాలయాన్ని ప్రభుత్వం అభివృద్ధి పరుస్తున్నది. ప్రయాణీకుల బంగాళా, సత్రివు నిర్మించబడుతున్నవి. ఇప్పుడు ప్రతిదినము బస్సు కర్నూలునుంచి, మార్కాపురం నుంచి సరాసరి శ్రీశైలానికి వెడుతుంది. దోర్నాల నుంచి శ్రీశైలానికి 36 మైళ్ల పొడుగున రోడ్డు నిర్మించబడింది.

సిర్వేల్ తాలూకా రుద్రవరానికి సమీపంలో వున్న అహోబిల దేవాలయం వైష్ణవులకు ముఖ్యమైనది.

మహానంది ప్రసిద్ధమైన మరొక యాత్రాకేంద్రం. శివరాత్రికి అనేక ప్రాంతాలనుంచి వచ్చి భక్తులు యీ ప్రదేశాన్ని దర్శిస్తారు.

## సమాజాభివృద్ధి

ప్రస్తుతం కర్నూలు జిల్లాలో దిగువ 16 కేంద్రాలలోను అభివృద్ధి కార్యక్రమం కొనసాగుతున్నది.

1 కర్నూలు, 2 గిద్దలూరు, 3 ఎర్రగొండపాలెం, 4 ఎమ్మిగనూరు, 5 పెద్దతుంబళం, 6 కోసిగి, 7 దేవరకొండ, 8 కోడుమూరు. 9 బెస్తవారిపేట 10 సంజమల, 11 కొమరోలు, 12 బ్రాహ్మణ కొట్కూరు.

13 ఎమ్. వి. నగర్, 14 నంద్యాల, 15 ఆదోని, 16 ఆలూరు. దిగువ 5 కేంద్రాలు కర్నూలులోని తుంగభద్రా ప్రాజెక్టు స్పెషల్ కలక్టరు అధ్వర్యంలో వున్నాయి. తుంగభద్రా ప్రాజెక్టు దిగువ కాలవ ఆయకట్టువానిలో వున్నందున అవి ఆయన అధ్వర్యంలో వున్నాయి.

1. ఆలూరు, 2. ఆస్పరి, 3. ఎమ్మిగనూరు, 4. పెద్దతుంబళం, 5. కోసిగి. మిగిలిన 11 కేంద్రాలు జిల్లా కలక్టరు అధ్వర్యంలో వున్నాయి.

| | |
|---|---|
| జిల్లా మొత్తం విస్తీర్ణం | 9215 చ.మైళ్లు |
| అభివృద్ధి కేంద్రాల క్రింద వున్న ప్రాంతం | 4379.28 ,, |
| వాటి క్రిందగల ప్రాంతంశాతం | 1.47% |
| జిల్లాలోగల మొత్తం గ్రామాల సంఖ్య | 1156 |
| అ. కేం. క్రిందగల గ్రామాల సంఖ్య | 758 |
| శాతం ———65.5% | |
| జిల్లామొత్తం జనసంఖ్య | 16,18,621 |
| సమాజాభివృద్ధి కార్యక్రమం-అమలు జరిగే ప్రాంతాల జనసంఖ్య | 11,43,747 |
| శాతం ———70.6% | |

## 30-9-57 నాటికి స్థానికాభివృద్ధి పనుల కార్యక్రమంక్రింద పూర్తిఅయిన పనులు

| | | |
|---|---|---|
| 1. మంచినీటి సరఫరా పథకాలు | ... | 80 |
| 2. నీటి పారుదల పనులు | ... | 2 |
| 3. మరుగు దొడ్లు | ... | 6 |
| 4. చిన్న, పెద్ద వంతెనలు | ... | 13 |
| 5. రోడ్లు | ... | 158 |
| 6. పాఠశాలల అభివృద్ధి పనులు | ... | 13 |
| 7. డిస్పెన్సరీల పనులు | ... | 12 |
| 8. గిడ్డంగులు | ... | 2 |
| 9. వసతిగృహాలు | ... | 3 |
| 10. పఠన మందిరాలు | ... | 11 |
| 11. ప్రసూతి వార్డులు | ... | 2 |
| 12. కమ్యూనిటీ హాల్సు | ... | 3 |
| 13. ఇతర పనులు | ... | 5 |
| మొత్తం | | 310 |

## లోకసభ సభ్యులు

ఈ జిల్లానుంచి లోకసభకు ఎన్నికయిన సభ్యులు :

1 శ్రీ ఉస్మాన్ అలీఖాన్, 2 శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య, 3 శ్రీ చేగిరెడ్డి బాలిరెడ్డి.

## శాసనసభ సభ్యులు

| | | |
|---|---|---|
| 1. శ్రీ బి.పి. శేషారెడ్డి | ... | ధోన్ |
| 2. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి | ... | కోయిల్‌కుంట్ల |
| 3. శ్రీ ఎస్. కె. లింగం | ... | నందికొట్కూరు |
| 4. శ్రీ ఇ. అయ్యపురెడ్డి | ... | నందికొట్కూరు |
| 5. శ్రీ సి. రామిరెడ్డి | ... | నంద్యాల |
| 6. శ్రీ ఎన్. వెంకటయ్య | ... | మార్కాపురం |
| 7. శ్రీ పి. రంగారెడ్డి | ... | గిద్దలూరు |
| 8. శ్రీ కె. ఓబులరెడ్డి | ... | కంభం |
| 9. శ్రీ ఎమ్. మహబూబు ఆలీఖాన్ | ... | కర్నూలు |
| 10. శ్రీ కె. విజయభాస్కర రెడ్డి | ... | ఎమ్మిగనూరు |
| 11. శ్రీ డి. సంజీవయ్య | ... | ఎమ్మిగనూరు |
| 12. శ్రీ హెచ్. రామలింగారెడ్డి | ... | ఆలూరు |
| 13. శ్రీ లక్ష్మీనారాయణ రెడ్డి | ... | పత్తికొండ |
| 14. శ్రీ సి.పి. తిమ్మారెడ్డి | ... | ఆళ్లగడ్డ |
| 15. శ్రీ ఎ. బి. తమ్మయ్య సెట్టి | ... | ఆదోని |
| 16. శ్రీ జి. బుస్సప్ప | ... | ఆదోని |

## ముఖ్య పథకాలు :

## వ్యవసాయం

కర్నూలులో కూరగాయల పరిశోధనా కేంద్రం ప్రారంభింపబడుతుంది. ఇక్కడ కొత్తరకాలను సాధించి, ప్రతిరకాన్ని మిక్కిలి పొదుపుగా పండించే విధానాలు కనుగొనబడతాయి. కూరగాయల విత్తనాల వుత్పత్తికై యీ కేంద్రం న్యూక్లియస్ విత్తనాల క్షేత్రంగా కూడా పనిచేస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లో పోకచెక్కల ఉత్పత్తిని ప్రోత్సహించే పథకం యీ జిల్లాలోని కాల్వ గ్రామంలో అమలు పరచబడుతుంది.

నంద్యాలలో వ్యవసాయ పరిశోధన కేంద్రం ఒకటి వున్నది.

## పశుపోషణ

జి. సింగవరంలో 27-3-58న ఒక కీలక గ్రామ కేంద్రం ప్రారంభింపబడింది. దానికి 6 వుప కేంద్రాలు వున్నాయి. ఈ కేంద్రానికి 8 ఒంగోలు వృషభాలు, 8 ముర్రాపోతులు మంజూరైనవి. ఇంతవరకూ రెండు ముర్రాపోతులు వచ్చాయి.

## సంస్థలు

కర్నూలులో వుపాధ్యాయుల శిక్షణా కళాశాల వున్నది. కర్నూలు వైద్య కళాశాల 1958 జూలై నుంచి 50 మంది విద్యార్థులతో నడుస్తున్నది. కర్నూలులో ప్రారంభించబడిన కాశిరెడ్డి వెంకటరెడ్డి ప్రభుత్వ స్త్రీల కళాశాల 1958 జూలై నుంచి నడుస్తున్నది.



## పురోగమన పథంలో

# తంబళ్లపల్లి కేంద్రం

చిత్తూరుజిల్లా మదనపల్లి తాలూకాలోని తంబళ్లపల్లి అభివృద్ధి కేంద్రంలో తంబళ్లపల్లి, బూరకాయల కోట రెవిన్యూ ఫిర్కాలు రెండూ వున్నాయి. వాటి విస్తీర్ణం 304.64 చ.మైళ్లు (19969.60 యెకరాలు) అభివృద్ధి కేంద్రి ప్రాంతంలో 39 ప్రధాన గ్రామాలు వున్నాయి. వాటిలో 3 నివాస గ్రామాలు కావు. ఈ ప్రాంతం మొత్తం జనసంఖ్య 58,407. ఈ కేంద్రం సముద్ర మట్టానికి 2200 అ. పైనవుంది. దానిలో పెద్దేరు, కుషావతి అనే రెండు చిన్న నదులు ప్రవహిస్తున్నవి.

ఈ అభివృద్ధి కేంద్రానికి వర్షాలు ఈశాన్య, నైఋతి ఋతుపవనాలవల్ల లభిస్తాయి. సీతోష్ణస్థితి సామాన్యంగా వుంటుంది. ఈప్రాంతంలో భూములు ప్రధానంగా యెర్రబంక, యిసుకతో కూడి వుంటాయి. ఇక్కడ మధ్యరకం చెరువులు, చిన్న చిన్న చెరువులు వున్నాయి. నీటి పారుదలకు అవే ఆధారం. పెక్కు ప్రైవేటు బావులు కూడా నీటి పారుదలకి చాలాభాగం తోడ్పడుతాయి. ఇక్కడ చాలినన్ని వర్షాలు లేక ప్రజలు బాధపడుతూ వుంటారు. ఇక్కడి పరిస్థితులు కరువుకి దారితీసే అవకాశం వుంది. ఈ ప్రాంతంలో 333 చిన్నరకం పంట చెరువులు, కాలువలు వున్నాయి.

వరి, రాగి, జొన్న, సజ్జ యిక్కడ పండే ప్రధాన ఆహార పంటలు. ఈ ప్రదేశం వేరుసెనగ పంటకి ప్రసిద్ధి. తోటలలో పేర్కొన దగినవి మామిడి. నిమ్మ జాతి తోటలు. మామిడితోటల క్రింద 500 యెకరాలు, నిమ్మజాతి తోటలక్రింద 50 యె. వున్నాయి. ఇక్కడినేల మామిడితోటల పెంపకానికి ఆదర్శప్రాయమైనది. శీతాకాలంలో యిక్కడ కొంత ప్రదేశంలో గోధుమలు కూడా పండించ బడతాయి. ఇక్కడ అనేకచోట్ల చెదురుగా మల్బరీ చెట్లు కనబడతాయి.

మద్రాసు-బొంబాయి హైరోడ్డు యీ అభివృద్ధి కేంద్రం దక్షిణపు దిశగా 10 మై. పొడుగున వ్యాపించి వున్నది. పాకాల-ధర్మవరం మీటర్ గేజ్ రైలుమార్గం యీ ప్రాంతంగుండా పోతుంది. అది దక్షిణపు కొసను 12 మై. పొడుగున వ్యాపించి వున్నది. ఈ ప్రాంతంలో సబ్-పోస్టాఫీసు లేదు. దీనికి మిక్కిలి సమీపంలోగల సబ్-పోస్టాఫీసు కురబల కోటలో వుంది. అక్కడ తంతి వార్తలుపంపే సౌకర్యాలు కూడా వున్నాయి. కురబల కోట అభివృద్ధి కేంద్రం ముఖ్య కార్యాలయం గల ప్రదేశానికి 14 మైళ్ల దూరంలోవుంది. ఈ ప్రాంతంలో మొత్తం 30 బ్రాంచి పోస్టాఫీసులు వున్నాయి. బూరకాయల పేటలో ఒకటి, తంబళ్ల పల్లిలో ఒకటి రెండు గ్రామీణ డిస్పెన్సరీలు వున్నాయి. ఈ ప్రాంతం శుద్ధ పల్లె ప్రాంతం. ఇక్కడి ప్రజలు పేదవారు. వైద్య సౌకర్యాలు చాలా తక్కువ. అభివృద్ధి కేంద్ర ప్రాంతంలో మాధ్యమిక పాఠశాల ఒక్కటి కూడా లేదు. రెండు వున్నత ప్రాధమిక పాఠశాలలు వున్నాయి. ఈ ప్రాంతంలో మొత్తం 31 పంచాయతీలు వున్నాయి. వాటిలో చాలభాగం కొత్తగా యేర్పడినవి.

ఇక్కడ ముఖ్యమైన దేవాలయం సోంపాలియంలో వుంది. అది శిల్ప సౌందర్యానికి ప్రసిద్ధి. అది ప్రాచీన కట్టడాల చట్టం క్రింద రక్షింపబడుతున్నది.

ఈ అభివృద్ధి కేంద్రం 27-10-56న ప్రారంభింపబడింది. 31-3-58 నాటికి అక్కడ సాధించబడిన అభివృద్ధి ప్రధానాంశాలు యివి:

## విద్య

నాలుగు కొత్త పాఠశాలలు ప్రారంభింపబడినవి. 16 మామూలు పాఠశాలలు వృత్తి విద్యా పాఠశాలలుగా మార్చబడినవి. పాఠశాలలు లేని 3 ప్రాంతాలలో వాటిని తెరుచుటకు సంకల్పించబడింది.

## సాంఘిక విద్య

10 వయోజన విద్యా కేంద్రాలు ప్రారంభించబడినవి. 427 మంది వయోజనులకు చదువు చెప్పబడింది. 12 పఠన మందిరాలు, 6 సంచార గ్రంథాలయాలు ప్రారంభింపబడినవి. 6 సామాజిక రేడియో సెట్లు నెలకొల్పబడినవి. 3 హరిజన మందిరాలకు సంగీత వాద్యాలు సరఫరా చేయబడినవి. 55 నీటి 'సీల్' మరుగు దొడ్లు, 155 పొగరాని పొయ్యిలు నిర్మించబడనవి. సుమారు పది గ్రామాలలో శ్రమదానంతో రోడ్ల నిర్మాణం యేర్పాటు చేయబడింది.

## వ్యవసాయం

1104 మణుగుల వుత్తమ వరి విత్తనాలు, 29 మణుగుల వుత్తమ మెట్ట ధాన్యపువిత్తనాలు, వేరుసెనగలో టిఎమ్‌వి 3 రకం విత్తనాలు 14 మణుగులు పంపిణీ చేయబడినవి. 2816 యెకరాలలో పచ్చియాకు యెరువు వేయబడింది. 185 యెకరాలభూమి ట్రాక్టరుతో దున్నబడింది. 1114.50 యెకరాల భూమిని బాగుచేసి సాగు క్రిందికి తేవడం జరిగింది. 816 యెకరాలలో జపాను పద్ధతి ప్రకారం పంటలు వేయబడినవి.

## పశుపోషణ

మొత్తం 7096 పశువులు వ్యాధుల నుంచి కాపాడబడినవి. 3051 పశులు రాణీఖేట్ నుంచి రక్షించబడినవి. 627 పశువులకు విత్తుకొట్టబడింది. 3 హల్లికార్ ఆంబోతులు సబ్సిడీ ప్రాతి పదికపై పంపిణీచేయబడినవి. ఒక ప్రథమ చికిత్సా కేంద్రం ప్రారంభింపబడింది. మరి మూడు కేంద్రాల స్థాపనకు విరాళాలు వసూలు చేయబడినవి.

## సహకారం

7 బహుళార్థ సాధక సహకార పరపతి సంఘాలు, 2 పెద్దరకం సహకార పరపతి సంఘాలు, ఒక గ్రామీణ బ్యాంకు రిజిష్టరు చేయబడినవి. అవి ప్రారంభమైనవి కూడా. 31-12-57 నాటికి 100 కి 26 కుటుంబాలు వీటిని వుపయోగించుకుంటున్నాయి. అభివృద్ధి కేంద్రం ప్రారంభానికి ముందు యీ సంఖ్య 100 కి 15 మాత్రమే.

2 అంబర్ చర్ఖా కేంద్రాలు 3 సావర్ చర్ఖా కేంద్రాలు ప్రారంభింపబడినవి.

## పనులు

10 గ్రామాలలో కచ్చారోడ్లు నిర్మించబడినవి. 14 క్రొత్త పాఠశాలా భవనాల నిర్మాణంచేపట్టబడింది. 5 మంచి నీటి బావులు నిర్మించబడుతున్నాయి. 5 మంచినీటి, బావులు బాగు చేయబడినవి. అన్ని పనులు తృప్తికరంగా కొనసాగుతున్నాయి. ఈ సంవత్సరంలో వాటి నిర్మాణం ఒక నిర్దిష్టదశకు రావచ్చు.



# రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల పురోగమనం

1-10-53 న ఆంధ్రరాష్ట్రం యేర్పడిన పిమ్మట తొలి ప్రణాళిక ద్వితీయ భాగంలో విద్యుచ్ఛక్తి వుత్పత్తి రంగంలో సాధించిన అభివృద్ధి అంతకు క్రితం 15 సంవత్సరాలలోను సాధించిన అభివృద్ధితో దాదాపు సమానంగా వుంది.

సమిష్టి మద్రాసు రాష్ట్రంలో (1-10-53 నాటికి) తొలి పంచవర్ష ప్రణాళికలో మొదటి సగం కాలంలోను ప్రణాళికలో మూడవ వంతు పని మాత్రమే అమలు జరిగింది. మిగిలిన రెండు వంతుల పని ఆంధ్రరాష్ట్రం యేర్పడిన పిమ్మట ప్రణాళికలో తరువాతి సగం కాలంలోను అమలుజరుప బడింది. పెట్టుబడి ఖర్చు, రెండింతలకి హెచ్చించ బడింది. అలాగే ప్రసార మార్గాల నిడివి, విద్యుచ్ఛక్తి వుత్పత్తి శక్తి రెండింతలు పెంచబడింది. 1-10-53 నాటికి 2,900 మైళ్లనిడివిగల ప్రసారమార్గాల నిడివి31-3-56 నాటికి 5,300 మైళ్లకి హెచ్చింది. 1-10-53 నాటికి 32,000 కె. వా. గా మాత్రమే వున్న విద్యుచ్ఛక్తి వుత్పత్తి శక్తి 31-3-56 నాటికి 63,200 కె. వా. హెచ్చించ బడింది.

గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రాధాన్యత యివ్వబడింది. 1-10-53 నాటికి విద్యుచ్ఛక్తిని పొందే గ్రామాల సంఖ్య 300. అది 31-3-56 నాటికి 681 కి హెచ్చింది. పైకాలంలో తలసరి వాడకం 5 నుంచి 8 యూనిట్లకు హెచ్చింది.

ఆంధ్ర రాష్ట్రానికి ఒక గ్రిడ్ యేర్పడింది. అది వుత్తరాన ఒరిస్సా సరిహద్దునుంచి పశ్చిమాన మైసూరు సరిహద్దు వరకూ వ్యాపించి వున్నది. యావత్తు రాష్ట్రానికి వర్తించే ఒకే విధమైన సుంకం రేట్లు ప్రవేశ పెట్ట బడ్డాయి. ఆ విధంగా పూర్వాంధ్ర రాష్ట్రంలో యెల్లెడల పరిశ్రమలు, వ్యవసాయం సత్వరం అభివృద్ధి చెందుటకు పునాది వేయ బడింది.

1956-57 లో అభివృద్ధి కార్యక్రమంపైస్థాయి లోనే కొనసాగించ బడింది.

1. మచ్ ఖండ్ జల విద్యుచ్ఛక్తి పథకం తొలి అంచె పూర్తిచేయ బడింది. దానిలో ఒక్కొక్కటి 17000 కె. వా. వుత్పత్తి శక్తిగల 3 వుత్పత్తి యూనిట్లు వున్నాయి. రెండవ అంచెకు అవసరమైన వుత్పత్తి యంత్రాలకై వ్రాయబడింది. దానిలో ఒక్కొక్కటి 21,250 కె. వా. శక్తిగల వుత్పత్తి యూనిట్లు 3 వుంటాయి.

2. పై సంవత్సరంలో నెల్లూరు విద్యుదుత్పత్తి కేంద్రంలో బొగ్గుతో పనిచేసే కొత్త బాయిలర్ పని ప్రారంభించింది.

3. 1957 జనవరిలో తుంగభద్రా ఆనకట్ట విద్యుదుత్పత్తి కేంద్రంలోని 9000 కె. వా. శక్తిగల వుత్పత్తి యంత్రం పని ప్రారంభించింది. తుంగభద్రా జల విద్యుచ్ఛక్తి పథకం తొలి అంచెలో మిగిలిన పని బాగా కొనసాగు తున్నది. దానిలో అట్టి వుత్పత్తి యంత్రాలు మరి 3 వున్నాయి.

4. పై సంవత్సరంలో విశాఖపట్నంలోని కాల్టెక్సునూనె శుద్ధి సంస్థలకు, విజయవాడ సమీపంలోని కృష్ణా సిమెంటు కంపెనీకి విద్యుచ్ఛక్తి సరఫరాకి సంబంధించిన కార్యక్రమం పూర్తి అయింది. సరఫరా ప్రారంభమైనది. గరివిడిలోని ఫెరోమాంగనీసు ఫ్యాక్టరీకి, నాగార్జున సాగర్ నిర్మాణం పనులకు, మాచెర్ల సిమెంటు ఫ్యాక్టరీకి సరఫరా చేయడానికి సంబంధించిన పని కొనసాగుతున్నది. పాణ్యాం సిమెంటు ఫ్యాక్టరీకి, ఆదోని నూలుమిల్లులకు విద్యు

చ్ఛక్తిని సరఫరాచేసే కార్యక్రమంకూడా పూర్తి అయింది.

5. 1956-57లో కొత్తగా యించు మించు 200 పట్టణాలు, పల్లెలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది.

6. ఆంధ్ర రాష్ట్ర ప్రాంతంలో విద్యుచ్ఛక్తి పథకాలపై మొత్తం, రూ 8 కోట్లు పెట్టుబడి పెట బడింది.

7. మొత్తం రాబడి సాలుకి యించు మించు రూ 160 లక్షలనుంచి యించు మించు రూ 210 లక్షలకి పెరిగింది.

8. 1954 ఆంధ్ర విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థల స్వాధీనం చట్టం క్రింద రాజమండ్రీ, గుంటూరు, ఇచ్ఛాపురం, గుడివాడలలోని లైసెన్సు దారుల విద్యుచ్ఛక్తి సంస్థలను ప్రభుత్వం తీసుకున్నది.

1957-58లో దిగువ ముఖ్యమైన పనులు పూర్తి చేయబడినవి.

1. మచ్ ఖండ్ పథకం రెండవఅంచె స్థాపన పనిలో 100కి 20 వంతులపని.

2. జాలాపుట్ ఆనకట్ట పని మిగులు 'సిల్' మట్టం వరకూ పూర్తిచేయబడింది. నీరునిలవచేయ బడుతున్నది.

3. తుంగభద్రా జల విద్యుచ్ఛక్తి పథకంతొలి అంచెలో మిగిలినపని పూర్తిచేయబడింది. ఇందులో 9000 కె. వా. సెట్లుమరి 3 వున్నాయి.

4. గరివిడిలోని ఫెర్రోమాంగనీసు ఫ్యాక్టరీకి విద్యుచ్ఛక్తి సరఫరా ఆరంభమయినది.

5. అదనంగా 200 గ్రామాలు, పట్టణాలకి విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది.

6. ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుతొలి అంచె విపుల పరిశోధన పూర్తి అయింది. పథకం నివేదికకు తుదిరూపమివ్వబడింది. అది కేంద్ర ప్రభుత్వం ఆమోదానికై పంపబడింది.

1958-59లో (1) మచ్ ఖండ్ రెండవ అంచె అభివృద్ధిలో మిగిలిన పనులు పూర్తిచేయబడతాయి. 21,250 కె. వా. సెట్లు 3 వుత్పత్తిని ప్రారంభిస్తాయి. జాలాపుట్ ఆనకట్ట పూర్తి యెత్తుకు నిర్మించబడుతుంది. సర్ ప్లస్ గేట్ల పని పూర్తి చేయబడుతుంది. ఈ పనులుకూడా పై రెండవ అంచె అభివృద్ధి పనులలో చేరి వున్నాయి.

2. తుంగభద్రా విద్యుదుత్పత్తి కేంద్రం రెండవ అంచె పనులు, నెల్లూరులోని 30 ఎమ్. డబ్ల్యు. థెర్మల్ కేంద్రానికి సంబంధించిన 'సివిల్' పనులూ కూడా చేపట్టబడగలవని భావించబడుతున్నది. వీటికి స్పెసిఫికేషన్లను యిచ్చి టెండర్లను ఆహ్వానించడానికి వీలుపడలేదు. ఎందుచేతనంటే, అందుకు కేంద్ర ప్రభుత్వం ఆమోదం యింకారాలేదు.

(3) సీలేరుజల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుకి సంబంధించిన సివిలు పనులు చేపట్టబడతాయి.

4. అదనంగా యించుమించు 120 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతుంది.

## రామగుండం థెర్మల్ కేంద్రం

తొలి పంచవర్ష ప్రణాళిక సమాప్తమయే సరికి రామగుండం థెర్మల్ కేంద్రం పని దాదాపు పూర్తి అయింది. దీనిలో బాయిలర్ ప్లాంటుతో కూడిన 12,500 కె.వా. శక్తిగల ఆవిరిటర్బో ఆల్టర్నేటర్లు 3, కూలింగుటవరు వున్నాయి. రామగుండం విద్యుతదుత్పత్తి కేంద్రంనుంచి బయలుదేరే 66 కె.వి ప్రసార మార్గంలో కొంత భాగం పూర్తిఅయింది.

నిజాంసాగర్ జల విద్యుచ్ఛక్తి కేంద్రం తొలి ప్రణాళిక సమాప్తి నాటికి పూర్తి అయింది. దీనిలో ఒక్కొక్కటి 5,000 కె.వా. శక్తిగల వుత్పత్తి యూనిట్లు 3 వున్నాయి. ఇది హైదరాబాదులోని హుస్సేన్ సాగర్ థెర్మల్ కేంద్రంతో కలుపబడింది.

తెలంగాణా ప్రాంతంలో విద్యుచ్ఛక్తి అభివృద్ధి కొంచెం యించుమించు హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలు రెండిటికి పరిమితమై వున్నది.

గ్రామాలలో దీని అభివృద్ధి అంతగా జరగలేదు. తొలి పంచవర్ష ప్రణాళిక సమాప్తి నాటికి 19 పట్టణాలు, గ్రామాలకి విద్యుచ్ఛక్తి సరాఫరా చేయబడినది.

1956-57లో దిగువ పనులు పూర్తి చేయబడినవి.

1: రామగుండంలోని 12,500 కె.వా. ఉత్పత్తి యూనిట్టు ఒకటి రెండు బాయిలర్లు, దానికి సంబంధించిన స్విచ్ గేర్ లను పరీక్షించడం పూర్తిఅయింది.

2. రామగుండం నుంచి మంచిర్యాలకి నిర్మించబడే 66 కె.వి. డబుల్ సర్క్యూటు మార్గం గోదావరీ నది క్రాసింగుతో సహా పూర్తిఅయింది.

3. నగర విద్యుచ్ఛక్తి సరఫరా పునర్వ్యవస్థీకరణకి సంబంధించిన పని జరుగుతున్నది.

4. 1956-57 లో అదనంగా 7 పట్టణాలకి, పల్లెలకి విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది. 1956-57 లో రూ 1.47 కోట్లు ఖర్చు పెట్టబడినది.

## 1957-58 లో

1. రామగుండం విద్యుదుత్పత్తి కేంద్రంలోని మిగిలిన వుత్పత్తి యూనిట్లు పరీక్షించబడినవి.

2. రామగుండం-హనుమకొండ 66 కె.వి మార్గం నిర్మాణం పూర్తి అయింది.

3. నగర విద్యుచ్ఛక్తి సరఫరా పునర్వ్యవస్థీకరణకు సంబంధించిన పని కొనసాగించబడింది. కొత్తగా చాల మందికి విద్యుచ్ఛక్తి సరఫరా ప్రారంభించబడింది.

4. వచ్చే 10 సంవత్సరాలలోను మొత్తం తెలంగాణా ప్రాంతమంతటిలోను సమన్వయ పూర్వకమైన అభివృద్ధిని సాధించుటకై ప్రస్తుతపు మంజూరీలన్నిటిని కలిపి యేకంగా ఒకే ఒక లాభదాయకమైన సమగ్ర పథకం రూపొందించబడింది.

5. పైన పేర్కొన్న సమగ్ర పథకం క్రింద 1957-58 లో యించుమించు 100 గ్రామాలకు, పట్టణాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది. 1957-58 లో ఖర్చు యించుమించు రూ. 3 కోట్లు. 1958-59 లో (1) సమగ్ర పథకం క్రింద "అనగా విద్యుచ్ఛక్తి శాఖ తుదిరూపమిచ్చిన "తెలంగాణా జల థెర్మల్ పథకం" క్రింద హైదరాబాదు-కర్నూలు హైదరాబాదు - మాచెర్ల 66 కె.వి. మార్గాలు పూర్తి చేయుటకు, (2) యించుమించు 500 మైళ్ల 33 కె.వి, 11 కె.వి, మార్గాలను నిర్మించి యించుమించు 100 గ్రామాలు, పట్టణాలకు కొత్తగా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయుటకు కార్యక్రమం తయారు చేయబడింది. 1958-59 లో రూ. 1.9 కోట్లను ఖర్చు చేయుటకు యేర్పాటు చేయబడింది.





ఆగస్టు 15 వ తేదీన ఫతేమైదానంలో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవంలో

# రాజధానీ నగరంలో

ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం పండిట్ నెహ్రూ నాయకత్వాన్ని బలపరచి ఆయన ప్రభుత్వ విధానాన్ని అనుసరించాలని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంలో ఫతేమైదానంలో జరిగిన బ్రహ్మాండమైన సభలో ప్రసంగిస్తూ అన్నారు.

ఉత్సవ కార్యక్రమంలో సాధ్యమైనంత యెక్కువ మంది ప్రజలు పాల్గొనుటకు వీలుగా యీ సంవత్సరం స్వాతంత్ర్య దినోత్సవాలు జరిపే పద్ధతి మార్చబడినదని ఆయన అన్నారు.

ప్రధాన మంత్రి అవలంబించిన శాంతిసుహృద్భావాల విధానాన్ని ప్రపంచం గుర్తించినదని చెబుతూ, తమలో తమకు గల విభేదాలను విస్మరించి ప్రభుత్వం ప్రారంభించిన జాతి నిర్మాణ కార్యక్రమాలను మన స్ఫూర్తిగా సమర్థించమని వివిధ రాజకీయ పక్షాలకు ఆయన విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వం తలపెట్టిన యే



స్వాతంత్ర్య దినోత్సవాన గవర్నరు XI, ముఖ్యమంత్రి XI ల మధ్య ఫుట్‌బాల్



పాల్గొన్న ప్రజానీకం (సంఖ్య 30,000 మించింది)

# స్వాతంత్ర్య దినోత్సవాలు

పథకం విజయమైనా ప్రజల సహకారంపై ఆధార పడి వుంటుందన్నారు.

అంతకుముందు ముఖ్యమంత్రి ఆంధ్రప్రదేశ్ స్పెషల్ పోలీసు నాలుగవ బ్యాటలైన్ సమర్పించిన గౌరవ వందనాన్ని స్వీకరించారు.

ఆ సాయంకాలం ఆలిండియారేడియో హైదరాబాదు కేంద్రంనుంచి ప్రసంగిస్తూ ఆర్థిక సాంస్కృతిక సమన్వయాన్ని, శాంతి పురోగమనాలను, సుఖ సంతోషాలను సాధించుటకు కృషి చేయమని ఆయన ప్రజానీకాన్ని వుద్బోధించారు. ఆ ప్రసంగం పాఠం యీ సంచికలో మరొకచోట పొందు పరచబడింది.

ప్రత్యేకంగా యేర్పాటు చేయబడిన స్పోర్ట్సు, ముఖ్య భవనాలు మున్నగు వాటికి దీపాలంకరణలు రాజధానీ నగరంలో జరిగిన వుత్సవ కార్యక్రమంలో ఒక భాగమై వున్నవి.



మ్యాచ్ జరిగింది. ఆ రెండు జట్లును చిత్రంలో చూడవచ్చు.



తేమైదానంలో జాతీయపతాకమును ఆవిష్కరించిన పిమ్మట వందన స్వీకారం చేస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి



రాష్ట్ర సహకార శాఖా మంత్రి శ్రీ మెహిదీ నవాజ్ జంగ్ ఫతేమైదానంలో సభలో ప్రసంగిస్తున్నారు.



రాష్ట్రముఖ్యమంత్రి ఫతేమైదానంలో విన్యాసాన్ని తనిఖీ చేసున్న దృశ్యం.



రాష్ట్ర హోం శాఖా మంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి ఫతేమైదానంలో సభలో ప్రసంగిస్తున్నారు.



దీపాలంకృతమైన రాజభవన్

# ప్రశ్నోత్తరావళి

50వ. ప్ర. (శ్రీ టి. చెంచురామయ్య, వాల్తేరు) మనరాష్ట్రంలో ద్వితీయ ప్రణాళిక కాలంలో యేయే పరిశ్రమలను స్థాపించ దలుచుకున్నారు ?

జవాబు. తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర కాగితం, కాగితం అట్టమిల్లులు నెలకొల్ప బడతాయి. నిజామాబాదులో ఒకటి ఆంధ్రప్రాంతంలో 5 సహకార పంచ దార ఫ్యాక్టరీలు నెలకొల్పబడతాయి. ఇవిగాక రాజమండ్రి ఆంధ్రి కాగితం మిల్లులు, గూడూరు ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీ విస్తరింప చేయబడతాయి.

51వ. ప్ర. (శ్రీ ఎ. నర్సింగరావు, ఎల్లంపేట, మేడ్చల్ తాలూకా) ఆంధ్రప్రదేశ్ గవర్నరుకి, శాసనసభ అధ్యక్షునికి, ముఖ్యమంత్రికి, యితర మంత్రులకి నెలకి యెంతెంత జీతం యివ్వబడుతుంది ?

జవాబు రాజ్యాంగంలో నిర్ణయమైన ప్రకారం గవర్నరు జీతం నెలకు రూ: 5,500/- ముఖ్యమంత్రి జీతం రూ. 1000/- ఇతర మంత్రులలో ఒక్కొక్కరి జీతం రూ. 1000/- శాసనసభ అధ్యక్షుని జీతం రూ. 1000/-

52వ. ప్ర. (శ్రీ ఎమ్. రాజకనకాచారి, ముద్దూరు, వరంగల్లుజిల్లా) దశాంశ పద్ధతి తూకములు, కొలతలు భారతీయ పేరులలో కాక దేశంలో సాధారణ మానవుడు పలుకుటకు, అర్థం చేసుకొనుటకు మిక్కిలి కష్టమయిన విదేశీయ పేరులలో యెందుకు ప్రవేశ పెట్టబడినవి ?

జవాబు మెట్రిక్ తూకములు, కొలతల నిమిత్తం భారతీయ పేరుల ప్రయోగం విషయమై, 1956 తూకములు; కొలతల ప్రమాణీకరణ చట్టాన్ని ఆమోదించే సమయంలో లోకసభ చర్చజరిపి, తుదకు ప్రస్తుతపు పేరులే ప్రయోగించబడాలని నిర్ణయించింది. ఇందువల్ల మన ప్రజలకు ప్రపంచంలో యిదివరకే అమలులో వున్న పేర్లు తెలుస్తాయి. అంతేకాక యిందువల్ల వివిధ భారతీయ భాషలలో వాటికి సమానార్థకమైన పదాలను తయారుచేసి, వాటిని ప్రజలలో వ్యాప్తి చేయడంలో ఉత్పన్నమయే కష్టమంతా తప్పుతుంది.

53వ. ప్ర. (శ్రీ పి. నర్సింగరావు, మెదక్) మన రాష్ట్రంలో యెన్ని కాగితం మిల్లులు వున్నాయి ?

జవాబు రెండు. ఒకటి రాజమండ్రిలోని ఆంధ్రా కాగితంమిల్లు. రెండు, ఆదిలాబాదుజిల్లా సిర్పూరులోని సిర్పూరు కాగితంమిల్లు.

54వ. ప్ర. (శ్రీ ఆర్. ఎస్. ఆర్. దాస్, ఓల్డుబ్రిడ్జి, హైద్రాబాదు) ఒక ప్రైవేటు సంస్థ కాకినాడలో వైద్య కళాశాలను ప్రారంభిస్తున్నదన్నమాట వాస్తవమేనా ?

జవాబు : వాస్తవమే.

55వ. ప్ర. ప్రభుత్వ వైద్యాధికారి పనులు యేమిటి? మందులు యిచ్చినందుకు ఆయన రోగుల వద్ద డబ్బు తీసుకొనవచ్చునా ?

జవాబు : రోగి డిస్పెన్సరీకి వచ్చినప్పుడు వైద్యసహాయం చేయడం ప్రభుత్వ వైద్యాధికారి పని. డిస్పెన్సరీలోవున్న మందులు, అక్కడ లభ్యమయే చికిత్స వుచితంగా చేయబడతాయి. ప్రభుత్వ డిస్పెన్సరీలన్నిటికి మందులు, మాత్రలు మెడికల్ స్టోర్సు డిపోచే సరఫరా చేయబడుతాయి. ఏదైనా ఒక మందు డిస్పెన్సరీలో లేనప్పుడు, అది అత్యవసరమని డాక్టరు అనుకొంటే దానిని స్థానిక మార్కెటులో కొని రోగుల కివ్వవచ్చు.

56వ. ప్ర. ఆంధ్రప్రదేశ్‌లో యెన్ని కళాశాలలు వున్నాయి ?

జవాబు : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వున్న కళాశాలల సంఖ్యా వివరాలు యివి.

1. సాధారణ విద్యకు వుద్దేశించబడిన పురుషుల కళాశాలలు ... 50
(హైదరాబాదు, ఆదిలాబాదులలో కొత్తగా ప్రారంభమైన రెండు కళాశాలలు కూడా వీటిలో చేరి వున్నాయి.)

2. సాధారణ విద్యకు వుద్దేశించబడిన స్త్రీల కళాశాలలు ... 6
(కర్నూలులో కొత్తగా ప్రారంభమైన కళాశాల కూడా వీటిలో చేరి వున్నది.)

3. ఉపాధ్యాయ శిక్షణకుద్దేశింపబడిన పురుషుల కళాశాలలు ... 7
(పెంటపాడులోని పోస్టు గ్రాడ్యుయేటు బేసిక్ ట్రైనింగు కాలేజీ కూడా వీటిలో చేరివున్నది.)

4. ఉపాధ్యాయ శిక్షణకుద్దేశింపబడిన స్త్రీల కళాశాలలు ... 1

57వ. ప్ర. తెలంగాణాలో తేనెను మిక్కిలి యెక్కువగా వుత్పత్తిచేసే ప్రదేశం యేది ?

జవాబు : మహబూబునగరం డివిజన్‌లోని కోయిల్ కొండ శ్రేణి. మహబూబునగరం డివిజన్‌నుంచి సేకరించబడే 1,600 పౌనుల తేనెలోను 600 పౌ. కోయిల్‌కొండ నుంచి లభిస్తుంది.



# కార్మికులకు హెచ్చు వేతనాలు

పారిశ్రామిక కార్మికుల వేతనాల విషయంలో హనుమంతరావు కమిటీచేసిన సిఫార్సులలో ముఖ్యమైన వాటిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆమోదించింది.

వారినివేదికలోని ముఖ్యమైన సిఫార్సులు యివి:-

1. కార్మికులందరికీ కనీసవేతనాన్ని నిర్ణయించాలి. జీతం, కరువుభత్యం, యింటి అద్దె మున్నగునవన్నీ కలిసి ప్రజోపయోగకరమైన పనులలో వున్న వారికి రూ 60/-, యితర పనులలో వున్నవారికి రూ 65 కనీస ప్రమాణంగా నిర్ణయించబడాలి.

2. పై వేతనంలో రూ 26/- మూల వేతనంగాను, మిగిలినది కరువు భత్యంగాను నిర్ణయించబడాలి.

3. కరువు భత్యాన్ని, జీవనవ్యయ సూచీతో జతచేసి ఆసూచీ ప్రమాణం హెచ్చితే కరువుభత్యాన్ని హెచ్చించాలి. అది తగ్గితే కరువుభత్యాన్ని తగ్గించాలి.

4. కార్మికులను తరగతులవారీగా విభజించాలి. వివిధ తరగతుల కార్మికుల జీతం స్కేళ్లను సవరించాలి.

## కనీసపుమూల వేతనం

ప్రభుత్వం యీ సిఫార్సులను చాలా జాగ్రత్తగా పరిశీలించింది. ప్రజోపయోగకరమైన పనులలోనున్న కార్మికులలో ఒక్కొక్కరికి మూల వేతనంగా కనీసం రూ 26 యివ్వాలనే సూత్రాన్ని ప్రభుత్వం అంగీకరించింది. మొత్తం జీతం విషయంలో కూడా ఒక కనీసపు ప్రమాణం వుండాలని ప్రభుత్వం అంగీకరిస్తున్నది. కాని పరిమితమైన రాష్ట్రాదాయం దృష్ట్యా దానిని ప్రజోపయోగకరమైన పనులలో నున్న వారి విషయంలో రూ 50/- లుగా నిర్ణయించింది. ఇదిగాక వివిధ ప్రాంతాలకు వర్తించే రేట్ల ప్రకారం ప్రస్తుతం వలెనే యింటి అద్దె భత్యం యివ్వబడుతుంది. అంటే మొత్తం జీతం దగ్గిరగా రూ 55/- లు వుంటుంది. ఇది హనుమంతరావు కమిటీ సిఫార్సుచేసినదాని కంటె రూ 5/- లు మాత్రమే తక్కువ. ప్రైవేటు పరిశ్రమలలోని కార్మికుల వేతనం కనీసపు ప్రమాణాన్ని రూ 55/-లుగా అనగా ప్రజోపయోగకరమైన పనులలో వారికంటే రూ 5/-లు యెక్కువగా నిర్ణయించి, యింటి అద్దెను వేరే యివ్వమని ప్రైవేటు పారిశ్రామికులకు సలహా యివ్వవచ్చునని కూడా ప్రభుత్వం నిర్ణయించింది,

ప్రభుత్వం బాగా ఆలోచించి కరువుభత్యాన్ని జీవనవ్యయ సూచీతో జతపరచడం ఆచరణ సాధ్యం కాదనే అభిప్రాయానికి వచ్చింది. అందువల్ల ఖర్చు యెక్కువ అవుతుంది. ప్రమాణంలోను, కాల వ్యవధిలోను కూడా నిర్దిష్టతవుండదు. 1947లో కేంద్రవేతన నిర్ణాయక సంఘం నివేదికలోని యిట్టి సిఫార్సును కూడా ఆచరణలో పెట్టడం సాధ్యం కాలేదు. బడ్జెట్టులు బడ్జెట్ సంవత్సరంలో ప్రభుత్వం రాబడి మార్గాలమీద, రాష్ట్రాలకు పన్నులు విధించుటకు గల శక్తిస్తోమతులమీద ఆధారపడి వుంటాయి. కాబట్టి వాటంతట అవి జరిగే యిట్టి సర్దుబాటులవల్ల బడ్జెట్టులు అవాస్తవం కాగలవు. కాబట్టి యీ సిఫార్సును అంగీకరించుటకు ప్రభుత్వానికి వీలులేకపోయింది.

వివిధ రకాల కార్మికులను తరగతుల వారీగా విభజించడం విషయంలో ప్రభుత్వం రూ 26 కనీస వేతనాన్ని యిచ్చుటకు తానుచేసిన నిర్ణయానికి అనుగుణంగా మూల వేతనం కనీసపు స్కేలు

రూ 26-1-30గా నిర్ణయించింది. పై తరగతులకు ప్రస్తుతపు వేతనపు స్కేళ్లు దిగువ పేర్కొన్న దానికి లోబడి యథాప్రకారం కొనసాగుతాయి. ఎందువల్ల నంటే యీ తరగతులు పని పరిస్థితులపైన, ఆయా పారిశ్రామిక సంస్థల రాబడి మార్గాలపైన ఆధార పడాలి.

తక్కువ రాబడివర్గం వుద్యోగులకు కొంత సహాయం చేయుటకై కరువు భత్యాలకు అర్హులై రూ 100/-లు వరకూ (రూ 100లు అంతకుపైన వేతనం పొందేవారి విషయంలో రూ 106లు వరకూ మార్జినల్ సర్దుబాట్లతో) వేతనం పొందేవారికి కరువు భత్యంలో నెలకు రూ 6లు హెచ్చించబడాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది. ఈ హెచ్చుదల రూ 50 వరకూ వేతనాల హెచ్చుదలలతో కలిపివేయబడు తుంది. ఇదియేకీ కృతమైన వేతనాలతో మార్కెటు రేట్ల ప్రకారం కాని లేక రోజువారీరేట్ల ప్రకారం కాని వేతనాలను పొందే కార్మికులకు వర్తించదు. తెలంగాణా జిల్లాల్లోని కొందరు కార్మికులకు, రాజ మండ్రీ ఆంధ్ర కాగితం మిల్లులలోని వారికి యిది వరకే యివ్వబడిన తాత్కాలిక కరువు భత్యం కూడా యీ హెచ్చుదలలో చేరివుంటుంది.

## 1958 ఆగస్టు నుంచి అమలు

పై నిర్ణయాలను 1-8-58 నుంచి అమలు పర చాలని ప్రభుత్వం వుత్తర్వు చేసింది. అనగా ఆగస్టు వేతనం లేక మజూరీ 1-9-58న చెల్లించబడాలి.

ఈ విధంగా ప్రభుత్వం హనుమంతరావు కమిటీ నివేదికలోని ప్రధాన సూత్రాలను అంగీకరించినట్టు విదితమేకదా.

వేతనపు కనీస ప్రమాణం విషయంలో, ప్రభుత్వం నిర్ణయించిన ప్రమాణం హనుమంతరావు కమిటీ సిఫార్సుచేసిన దానికంటె రూ 5/-లు మాత్రమే తక్కువ. మిగిలిన తక్కువ రాబడి వర్గాలకు కరువు భత్యంలో అదనంగా రూ 6/-లు వస్తున్నది. అందు వల్ల రాష్ట్రపు ప్రస్తుత ఆర్థిక పరిస్థితులు భరించగలిగి నంతా ఖర్చు కాగలదని భావించబడుతున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద అభివృద్ధి పథ కాలకు పెట్టుబడి అధికంగా కావలసివస్తున్న యీ తరుణంలో యింతకంటే యెక్కువ ఖర్చుపెట్టుట సాధ్యంకాదు.

ప్రతికూల విమర్శలకు జవాబుగా యీ నిర్ణయా లను విస్పష్టంచేస్తూ ప్రభుత్వం ఒక పత్రికా ప్రకటనను చేసింది. వివరాలు యివి.

"హనుమంతరావు కమిటీ పరిశీలన క్రిందకు వచ్చే ప్రభుత్వవిభాగంలోని నిపుణులు కాని పారి శ్రామిక కార్మికులు యింతవరకూ నెలకు రూ 24/- మాత్రమే మూలవేతనంగా పొందుతుండేవారు. కరువు భత్యం, యింటి అద్దెల క్రింద మరొక రూ 24 పొందేవారు. దీనిలో 1956లో మంజూరైన హెచ్చు దలకూడా చేరివున్నది. ఈ విధంగా వారికి నెలకు రూ 48/-లు మాత్రమే వస్తూవుండేవి. ప్రజో పయోగ కరమైన పనులలో వున్నవారికి కనీస వేతన ప్రమాణం రూ60/-లు వరకూవుండాలని హనుమంత రావు కమిటీ సిఫార్సు చేసింది. ఇందులో రూ 26/-లు మూలవేతనంగాను, మిగిలినది కరువు భత్యంగాను వుండాలి. కార్మికులు రూ 26/- మూల వేతనాన్ని, రూ 24/- కరువు భత్యాన్ని పొందా లని ప్రభుత్వం యిప్పుడు నిర్ణయించింది. ఇదికాక రూ 100/-కి తక్కువగా వేతనం పొందేవారికి కరువు భత్యంలో రూ 6 హెచ్చుతాయి. రూ 100లకి పైన వేతనంగలవారి విషయంలో రూ 106ల వరకూ మార్జినల్ సర్దుబాట్లు చేయబడతాయి. దీనికితోడు ప్రస్తుతం వలెనే వివిధ ప్రదేశాలకు వర్తించే రేట్ల ప్రకారం కరువుభత్యం యివ్వబడుతుంది. ఈ విధంగా రూ 48లను పొందే వుద్యోగికి యిప్పుడు రూ 48 ప్లస్ రూ 6 కరువుభత్యం అనగా రూ 54 ప్లస్ మామూలురేట్ల ప్రకారం యింటి అద్దె భత్యం వస్తుంది. దీనితో అతని మొత్తం వేతనం రూ 59 కాగలదు. హనుమంతరావు కమిటీ సిఫార్సుచేసిన రూ 60/-లు కంటే దీనిలో యింక ఒక్క రూపాయ తక్కువ అంతే. మొత్తం జీతం రూ 44 కంటే

తక్కువగల ఉద్యోగులందరికి యికనుంచి సమానంగా, వర్తిస్తే యింటి అద్దె భత్యంతో కూడుకుని, రూ 50 వస్తాయి. రూ 45, అంతకంటె పైనావచ్చేవారికి అదనంగా రూ 6 ప్లస్ వర్తిస్తే యింటి అద్దెభత్యం వస్తాయి. అనగా రూ 51 కాని లేక అంతకంటె, యెక్కువ కాని వస్తాయి. రూ 100 కాని లేక అంతకంటె తక్కువ కాని జీతం పొందేవారికి కనీసపు పెంపుదల యేపరిస్థితులలోను రూ 6 తగ్గదు. కాబట్టి ప్రభుత్వం కమిటీ సిఫార్సులను పూర్తిగా త్రోసి పుచ్చినదని కానిలేక ప్రభుత్వ నిర్ణయంవల్ల కార్మికులకు కేవలం లెఖ్ఖ రెండు రూపాయలు మాత్రమె అదనంగా లభిస్తాయని కాని అనడం సరికాదు. ప్రభుత్వం యీ నివేదికను పూర్తిగా పరిశీలించి, తన ఆర్థిక పరిస్థితి కనుగుణంగా యెంత సహాయం చేయగలదో అంతా చేసింది. ప్రభుత్వ నిర్ణయాలవల్ల కలిగే ఫలితాల పట్ల యేమైనా సందేహాలు వుంటే, యీ వివరణ వాటిని తొలగించగలదని ప్రభుత్వం ఆశిస్తున్నది."



# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

## గూడూరు సమాజాభివృద్ధి కేంద్రం

"సమాజాభివృద్ధి కార్యక్రమంవల్ల గ్రామీణు లందరూ తమతమ అదృష్టానికి కర్తలు అయారు. దానివల్ల వారికి తమతమ గ్రామాలను అభివృద్ధి పరచుకొని దేశానికి సేవచేసే మహదవకాశం లభించింది. దానిద్వారా వారు సంపూర్ణంగా స్వయం పరిపాలకులు అయారు." అని 15-7-58న గూడూరులో గూడూరుసమాజాభివృద్ధి (1వ. అంచె) కేంద్రం ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన నెల్లూరు జిల్లా జడ్జి, సెషన్సు జడ్జి అయిన శ్రీ వై. సత్యనారాయణరావు అన్నారు. ప్రజాస్వామ్యం ప్రజల సహకారం, చిత్తశుద్ధి, నిజాయతీలమీద ఆధారపడి వున్నదని కూడా ఆయన అన్నారు.

లోకసభ సభ్యుడు శ్రీ రేబాల లక్ష్మీనరసింహారెడ్డి యీ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. సమాజాభివృద్ధి కార్యక్రమం గ్రామీణులలో నూతనోత్సాహాన్ని కలిగించినదని ఆ సందర్భంలో ఆయన అన్నారు. ఈ కార్యక్రమ నిర్వహణతో సహకరించాలనే ప్రజల యిచ్ఛ స్పష్టతరమైన రూపందాలుస్తున్నది. దాని వుపయోగం గురించి అందరికీ బాగా తెలిసిందికూడా. సమాజాభివృద్ధి కార్యక్రమంవల్ల అభివృద్ధికి లభించిన అవకాశాలను పూర్తిగా వుపయోగించుకోమని, వుద్యోగులుచేసే సహాయాన్ని పూర్తిగా వుపయోగించుకుని ఆ కార్యక్రమం విజయానికై తోడ్పడమనీ ఆయన విజ్ఞప్తి చేశారు.

జిల్లా ప్లానింగు అధికారి శ్రీ వి. మల్లిఖార్జునం సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రాధాన్యతను, వుపయోగాలను వివరిస్తూ, వుద్యోగుల దృక్పథంలో పూర్తి మార్పు కలిగినదనీ యిప్పుడు వారిలో సేవాభావం మూర్తివంతమైనదని అన్నారు. ధనాభావంవల్ల అభివృద్ధి కార్యక్రమం యేమీ కాగలదోనని కొందరు వెలిబుచ్చిన పురస్కరించుకుని ఆయన యిలా అన్నారు: డబ్బులేనిదే యేపనీ జరగదని అనడం పొరపాటు. దేశానికి కావలసినంత అంగబలం వున్నదనీ, దానిని సరియైన పంథాలో నడిపిస్తే అద్భుతమైన ఫలితాలు లభిస్తాయనీ ఆయన అన్నారు.



శ్రీకాకుళం జిల్లాలో పచ్చి యెరువు వారోత్సవంలో భాగంగా జిల్లేడు తొలగింపు వుద్యమం ప్రారంభింపబడింది. ఆ వుద్యమాన్ని ప్రారంభిస్తున్న జిల్లా కలక్టరును చిత్రంలో చూడవచ్చు.

గూడూరు పురపాలక సంఘం అధ్యక్షుడు శ్రీ పి. సిద్ధయ్యనాయుడు మాట్లాడుతూ చిన్నమొత్తాల పొదుపు వుద్యమాన్ని విజయవంతం చేయమని విజ్ఞప్తి చేశారు.

అంతకు క్రితం వుదయం, నెల్లూరు జిల్లా కలక్టరు శ్రీ వి. శ్రీనివాసాచారి అభివృద్ధి కేంద్ర కార్యాలయాన్ని తెరిచారు. అక్కడ ఆయన జాతీయ పతాకాన్ని యెగురవేశారు. పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టారు.

ఈ సందర్భంలో తాలూకా ఆఫీసులో ఒక సాంస్కృతిక ప్రదర్శనం జరిగింది. చేతి పరిశ్రమల వస్తువులు, వ్యవసాయ, పశువైద్యాలకి సంబంధించిన పరికరాలతో కూడిన ప్రదర్శన జరిగింది.

ఈ సమాజాభివృద్ధి కేంద్రం లాంఛనంగా 15-7-58న ప్రారంభింపబడిందే కాని అసలు అది గడచిన 7 నెలలుగా పనిచేస్తూనే వున్నది. దాని విస్తీర్ణం 251.25 చ. మైళ్లు. గూడూరు, తిక్కవరం ఫిర్కాలలోగల 61 గ్రామాలు దాని క్రింద వున్నాయి. దానిలో జరిగే కార్యక్రమాలు 71706 మందికి ఉపయోగిస్తాయి.

## శిక్షణాశిబిరాలు

కర్నూలు జిల్లా సంజమల జా. వి. సే. కేంద్రంలోని గిద్దలూరు గ్రామంలో 17-6-58 నుంచి 19-6-58 వరకూ వ్యవసాయవర్గానికి సంబంధించిన విషయాలలో గ్రామసహాయకుల రెండవ శిక్షణాశిబిరం జరిగింది.

గిద్దలూరు గ్రామపంచాయతీ అధ్యక్షుడు, శిబిర శిక్షితులలో ఒకరూ అయిన శ్రీ బి. వి. నాగిరెడ్డి 17-6-58న జాతీయ పతాకాన్ని యెగుర వేశారు. మరొక శిక్షితుడు శ్రీ ఎమ్. బలరామిరెడ్డి శిబిరాన్ని ప్రారంభించారు.

లోకసభ సభ్యుడు శ్రీ పి. వెంకట సుబ్బయ్య, సంజమలబోర్డు వున్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ ఎస్. సుబ్బారెడ్డి, అభివృద్ధి కేంద్రం వుద్యోగులు, తదితరవుద్యోగులు పలువురూ శిబిరం జరిగిన మూడు రోజులలోను శిక్షితుల సమావేశంలో ప్రసంగించారు.

వ్యవసాయం, పశుపోషణలలో వుత్తమ పద్ధతులు అమలు పరచిచూపబడినవి. సోకేజిగుంటలు, పొగరాని పొయ్యిల విషయంలో ప్రదర్శనలు జరుపబడినవి.

శ్రమదానం జరుపబడింది. అందులో శిక్షితులు, అభివృద్ధి కేంద్రం వుద్యోగులు, గ్రామీణులు పాల్గొని 150 గజాల కచ్చారోడ్డును నిర్మించారు.

ఆటలు, పశుప్రదర్శన, జానపదనృత్యాలు, కోలాటములు, భజనలు యేర్పాటు చేయబడ్డాయి. ఒక శిశుప్రదర్శనం కూడా యేర్పాటు చేయబడింది. పోటీలలో నెగ్గినవారికి, వుత్తమమైన గ్రామసహాయకులకు బహుమతులు యివ్వబడినవి.

శిబిర నిర్వహణకై ప్రజలు రూ 342 విరాళమిచ్చారు. పూర్తిగా దానితోనే శిబిరం నిర్వహించబడింది. ప్రజల విరాళాలతో వరుసగా నిర్వహించబడిన శిబిరాలలో యిది రెండవది.

వ్యవసాయదార్లు, పంచాయతీ సభ్యులు, గ్రామాధికార్లు, స్త్రీలు మొత్తం 66 మందికి యీ శిబిరంలో శిక్షణ యివ్వబడింది.

## మర్రిపాడులో

కావలి డిప్యూటీ కలక్టరు శ్రీ కుమారరాజారెడ్డి మర్రిపాడులో 13-7-58న వ్యవసాయంలో ప్రత్యేకంగా మూడు రోజులు జరిగే గ్రామసహాయకుల శిక్షణా శిబిరాన్ని ప్రారంభించారు. అది వుదయగిరి సమాజాభివృద్ధి కేంద్రం అధ్వర్యాన నడుపబడింది. గ్రామీణులలో విభేదాలను తొలగించి, వారిలో అభ్యుదయదృక్పథాన్ని కలిగించుటకు కృషిచేయమని ఆ సందర్భంలో ప్రసంగించిన డిప్యూటీ కలక్టరు ప్రభృతులు శిక్షితులకు విజ్ఞప్తి చేశారు.

## బోయల పల్లిలో

ఎర్రగొండ పాలెంసమాజాభివృద్ధి కేంద్రం అధ్వర్యంలో బోయలపల్లిలో 18-6-58 నుంచి 20-6-58 వరకూ గ్రామ నాయకుల శిక్షణా శిబిరం జరిగింది.

శిబిరం ప్రారంభోత్సవానికి మార్కాపురం రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు శ్రీ ఎమ్. హాయత్ అధ్యక్షత వహించారు. శిక్షణ నిమిత్తం పంచాయతీ బోర్డులు, సహకార సంఘాలు మున్నగు సంస్థల అధ్యక్షులు, సభ్యులు యెన్నబడ్డారు.

శిబిరదైనందినవ్యవహారాల నిర్వహణకై తొలి రోజున శిక్షితుల నుంచి మంత్రుల వర్గం ఒకటి యేర్పాటు చేయబడింది. వివరాలు యివి :

1. శ్రీ ఎమ్. కోటయ్య, ప్రధాన నాయకుడు (సాధారణ అజమాయిషీ, కార్యక్రమశిక్షణ)

2. శ్రీ ఎమ్. సాంబయ్య, ఆహారమంత్రి (భోజన, వసతి సౌకర్యాలు)

3. శ్రీ కె. రవణమూర్తి, విద్యామంత్రి (ఉపన్యాస తరగతుల యేర్పాటు)

4. శ్రీ పి. వెంకటస్వామి, శ్రమదానం మంత్రి

5. శ్రీ కె. పెగయ్య, సంస్కృతీ కార్యక్రమాల మంత్రి. (సాంస్కృతిక కార్యక్రమాల బాధ్యత వహించాలి.

ఈ అయిదుగురూ నిర్ణీతమైన తమతమ విధులను అద్భుతంగా నిర్వహించారు. శిక్షితులు బోయలపల్లి ప్రధాన వీధిలో పక్కల నాలుగు ఫర్లాంగుల మురుగు కాలవలను త్రవ్వారు.

ఒక గ్రామీణ ప్రదర్శన యేర్పాటు చేయబడింది. అందులో వ్యవసాయ పరికరాలు, వుత్తమ విత్తనాలు, రసాయన యెరువులు, సమూనా పశువులపాక, పెంట యెరువు గుంట, పోస్టర్లు, చార్టులు స్త్రీల క్లబ్బులలో తయారయిన దుస్తులు వగైరా, నాయుడు పాలెంలోని తోలుపదును, తోలు వస్తువుల వుత్పత్తి-శిక్షణా కేంద్రంలో తయారైన పాదరక్షలు ప్రదర్శింపబడినవి. ప్రదర్శితమైన వివిధవస్తువులకు సంబంధించిన విషయాలు ప్రసంగాల ద్వారా తెలియ చేయబడినవి. ఆ సందర్భంలో అవసరమైనప్పుడల్లా ప్రత్యక్ష నిదర్శనాలు చూపబడినవి.

వయోజన విద్య, సమాజాభివృద్ధి కార్యక్రమాల ప్రచారం సలుపుటకై శిక్షితులు సర్వాయపాలెముకు తీసుకుని వెళ్ల బడ్డారు.

శిబిరం వీడ్కోలు వుత్సవం 20-6-58న బ్లాక్ ప్లానింగు, అభివృద్ధి కేంద్రం సభ్యుడు శ్రీ ఏ. బాల కోటరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఎర్రగొండ పాలెం మెడికల్ ఆఫీసరు డా. హెచ్. నాగేశ్వరరావు శిక్షితులకు సర్టిఫికెట్లను, అక్కడ జరిపిన వివిధ పోటీలలో నెగ్గిన వారికి బహుమతులను పంచిపెట్టారు. ఎర్రగొండపాలెం బ్లాకు డెవలప్ మెంటు ఆఫీసరు వీడ్కోలు ప్రసంగాన్ని చేశారు.

శిబిరం జరిగిన రోజులలో రోజూ రాత్రిళ్లు సాంస్కృతిక కార్యక్రమాలు యేర్పాటు చేయబడ్డాయి.

బోయలపల్లి గ్రామీణులు, వుపాధ్యాయులు, చుట్టుపట్ల గ్రామాల ప్రజలు శిబిరం విజయవంతం కావడానికి తమశక్తి కొలదీ తోడ్పడ్డారు.

శిబిర నిర్వహణకై ప్రభుత్వం యిచ్చిన సొమ్ము రూ 75 మాత్రమేకాగా గ్రామీణులు రూ 1,600 విరాళంగా యిచ్చారు.

## సింగనమల జా. వి. సే. కేంద్రం

అనంతపురంజిల్లా సింగనమల జా. వి. సే. కేంద్రంలో ఆ కేంద్రం ప్రారంభమైన నాటినుంచి 1125 యెకరాల భూమికి నీటి పారుదల సౌకర్యాలు కలిగించ బడ్డాయి. ఇందు నిమిత్తం ఎలక్ట్రిక్ మోటార్లు, ఆయిల్ ఇంజన్లు తేబడినవి. కొత్తగా బావులు త్రవ్వబడినవి. అదివరకటి బావులు లోతు చేయబడినవి. పై ప్రయోజనానికై రైతులకు అభివృద్ధి కేంద్రం సొమ్మునుంచి రూ 71,400 లు అప్పు యివ్వబడినవి.

6378 యెకరాలు జపాను పద్ధతి వరిసాగు క్రిందికి తేబడినవి. అభివృద్ధికేంద్రంలో ముఖ్యంగా అచ్చుకట్టు నార్పల ఫిర్కాలో 314 యెకరాలలో ఉద్యాన ఫలాలతోట నాటబడింది.

పశుసంతతి అభివృద్ధికై 10 ఆంబోతులు సరఫరా చేయబడ్డాయి. సహకారంక్రింద తరిమెలగ్రామానికి, ఆ చుట్టుపట్ల గ్రామాలకి వుపకరించుటకై ఒక గ్రామీణ బ్యాంకు ప్రారంభింప బడింది. బుక్కరాయ సముద్రం, చియ్యేడులలో 2 పెద్దరకం సహకార సంఘాలు కూడా ప్రారంభింప బడినవి.

4 గ్రామాలలో ఒక్కగదిగల 10 పాఠశాలా భవనాల నిర్మాణం పూర్తిచేయ బడింది. 10 రోడ్డు పనులు, 11 బావుల పనులు కూడా పూర్తి చేయ బడినవి. పై పనులకై గ్రామీణులు మొత్తం రూ 17271 విరాళం యిచ్చారు.

పాఠశాలలు లేని గ్రామాలలో 11 జా. వి. సే. పాఠశాలలు ప్రారంభింప బడినవి.

తరిమెల గ్రామంలో మంచినీటి సమస్య పరిష్కారానికై యెత్తుమీద నీటిచెరువు నెలకొల్ప బడింది. గొట్టాలు వేయడం కూడా పూర్తి చేయబడింది. ఈ

పనులు స్థానికాభివృద్ధి పనుల కార్యక్రమం క్రింద జరుప బడినవి. సింగనమలలో ఒక డిస్పెన్సరీ. ఒక ప్రాథమిక పాఠశాలా భవనం నిర్మించ బడ్డాయి. అదే కార్యక్రమం క్రింద గోవిందరావు పేటలో ఒక అప్రోచ్ రోడ్డు నిర్మించ బడింది.

## సిబ్బంది సమావేశం

విశాఖపట్నం జిల్లా జా. వి. సే., సమాజాభివృద్ధి కేంద్రాలు, బహుళార్థ సాధక ప్రాజెక్టుల సిబ్బంది నెలసరిసమావేశం విశాఖపట్నంజిల్లా కలక్టరు కార్యాలయంలో 21-7-58 న జరిగింది. ఆ సమావేశానికి అధ్యక్షత వహించిన జిల్లా కలక్టరు జిల్లాలోని అభివృద్ధి కేంద్రాలన్నిటిలోను 1958 జూన్ వరకూ జరిగిన వివిధ అభివృద్ధి కార్యక్రమాల పురోగిమనాన్ని సమీక్షించారు. సమాజాభివృద్ధి కార్యక్రమంతో సంబంధంగల జిల్లా అధికారు లందరూ సమన్వయ పూర్వకమైన చర్యను గైకొనడం అవసరమని ఆయన నొక్కిచెప్పారు. చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం క్రింద వసూళ్లను అధికం చేసే విషయమై చర్చలు జరుప బడినవి

అందరు జిల్లా అధికారులు, అభివృద్ధి కేంద్రాల అధికార్లు, ప్రాజెక్టు నిర్వహణాధికార్లు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు యీ సమావేశానికి వచ్చారు.



# నూతన పంచాయతీ సమితి

## సాముదాయక అభివృద్ధిలో విప్లవాత్మకమైన మార్పు తేగలదు

(హైదరాబాద్ రేడియో స్టేషనునుండి 1958 జూలై 30వ. తేదీన ప్రసారితమైన సంభాషణనుండి).

**శ్రీ డి. దుర్గయ్య:**

ప్రభుత్వమువారు 1958 జూలై 1వ తేదీనుండి తాత్కాలిక పంచాయతి సమితులను స్థాపించారని విన్నాను. అవి ఎన్నో, ఎక్కడ నిర్మించారో సెలవిస్తారా!

**శ్రీ యల్. భక్తవత్సలు:**

అవునండీ దుర్గయ్యగారు. ప్రజాస్వామ్య పద్ధతిలో పరిపాలనాధికారాన్ని వికేంద్రీకరించాలనే ఉద్దేశముతో ప్రభుత్వము రాష్ట్రములో ప్రతి జిల్లాకొకటి చొప్పున 20 తాత్కాలిక పంచాయతి సమితులను స్థాపించింది. ఆంధ్ర ప్రాంతంలో శ్రీకాకుళం జిల్లాలోగారా, విశాఖపట్టణం కోటవురట్ల, తూర్పు గోదావరి కొత్తపేట, పశ్చిమగోదావరి మలకపల్లి, కృష్ణా నూజవీడు, గుంటూరులో-నాదెండ్ల, నెల్లూరు ఇందుకూరుపేట, చిత్తూరు కలికిరి, కడప-పోరుమామిళ్ల, అనంతపురం-కొడిగెనహళ్లి, కర్నూలు కోడుమూరు, తెలంగాణ ప్రాంతంలో హైదరాబాదు జిల్లాలో మేడిచల్, నల్లగొండ-భువనగిరి, వరంగల్-మహబూబాబాదు ఖమ్మం-కల్లూరు, మెదక్-పటన్ చెరువు, మహబూబ్‌నగర్-షాద్‌నగర్, నిజామాబాద్-బాన్స్‌వాడ, ఆదిలాబాద్-లక్సెట్టిపేట, కరీంనగర్-గంగాధరలో ఈ పంచాయతి సమితులు ఏర్పాటు చేయబడినవి.

**శ్రీ ఆర్. యల్. యన్. మూర్తి:**

భక్తవత్సలుగారూ! మీరింతవరకు చెప్పినవన్ని బ్లాకులను కొంటాను. అయితే ఈ సమితులను ఆ బ్లాకులలో ఏర్పరిచారన్నమాట.

**శ్రీ భక్తవత్సలు:**

అవునండీ మూర్తిగారూ.

**శ్రీ దుర్గయ్య:**

ఏమండీ భక్తవత్సలుగారూ! ఈ సమితులను ఏర్పాటు చేసినంత మాత్రాన సాముదాయక అభివృద్ధి కార్యక్రమంలో గొప్ప మార్పు వచ్చేస్తుందా! ఈ పంచాయతి సమితులు బ్లాకు ప్రణాళికాభ్యుదయ సంఘాలవలె సలహా సంఘాలుగా పనిచేస్తాయని అనుకొంటాను. అయితే ఈ సమితుల ప్రత్యేకత యేమిటి?

**శ్రీ భక్తవత్సలు:**

ఈ రెండింటికి చాలతేడావున్నది, దుర్గయ్యగారూ!

వాస్తవమే. బ్లాకు స్థాయిలో ప్రజలు, ఉద్యోగులు కలిసిన సలహా సంఘాలున్నాయి. ఆ సంఘాలు బ్లాకులలోని అభివృద్ధి కార్యక్రమాన్ని సమీక్షజేస్తూ నూతన పద్ధతులను నిర్ణయించేస్తాయి. అయితే ఆ కమిటీలు సలహాలను మాత్రము ఇవ్వగలిగినవే. అందుచేత ఈ సలహా సంఘాలను బలవత్తరము చేయడమేగాక అన్ని స్థాయిలలో, ప్రత్యేకముగా బ్లాకు

స్థాయిలో చక్కనిపద్ధతిలో ప్రజాస్వామ్య పరిపాలనా వ్యవస్థను ఏర్పరచవలసిన ఆవశ్యకత యేర్పడినది. పంచాయతి సమితి బ్లాకు స్థాయిలో జిల్లా పరిపాలనను, పంచాయతీల పరిపాలనతో సమన్వయ పరచును. శాశ్వత సమితులు ఏర్పాటు చేయడానికి శాసనము చేయవలసి యున్నందున ప్రస్తుతానికి తాత్కాలిక సమితులు మాత్రము ఏర్పాటు చేయబడ్డాయి. ప్రభుత్వము ఈ సమితులను త్వరగా ప్రారంభించాలని ఆదుర్దా పడుతున్నందున యీ తాత్కాలిక సమితులు ఇప్పుడు ఏర్పాటుగావించబడినవి.

నేను ఆ సమితుల విధులను, కార్యక్రమాన్ని విశదీకరించి చెప్పినట్లైయితే సామూదాయక అభివృద్ధి కార్యక్రమాన్ని ఈ సమితులు తప్పక మార్చగలవన్న నా అభిప్రాయముతో మీరు తప్పక ఏకీభవిస్తారనుకొంటాను మూర్తిగారూ. ప్రస్తుతం ప్రభుత్వ శాఖలు నిర్వహిస్తున్న అభివృద్ధి కార్యకలాపాలు ఈ సమితులకు అప్పగించబడుతాయి. ప్రభుత్వ శాఖలకు ప్రస్తుత మిస్తున్నడబ్బు, అఖిల భారత సంఘాలచే ఇవ్వబడు ధనసహాయం, ప్రజలనుండి వచ్చే విరాళాలు అన్నియు ఇకమీదట ఈ సమితులకే ఇవ్వబడుటచేత వాటి ఆర్థిక పరిస్థితి చక్కగా ఉంటుంది. ఆ సమితుల విధులను గూర్చి విపులముగ తెలుసుకొనడానికి మనకిప్పుడంతగా అవకాశము లేదు. ఈ సమితులకు అప్పగిస్తున్న కార్యక్రమమంతా ఒక్కమాటతో చెప్పాలంటే, ఇక మీదట గ్రామశ్రేయోభివృద్ధి కార్యక్రమంలో రాష్ట్ర ప్రభుత్వం చేయకలిగినది కొద్ది మాత్రమే వుంటుంది. ప్రభుత్వపు పనియేమంటే నిపుణులనుండి సాంకేతిక విజ్ఞానాన్ని సమితులకందించి, వాటి కార్యక్రమాన్ని పర్యవేక్షించుట మాత్రమే.

శ్రీ దుర్గయ్య :

ఏమండీ భక్తవత్సలుగారూ! రాష్ట్రమంతటా ఉన్న సుమారు 450 బ్లాకులలోగూడ ఈ పంచాయతీ సమితులు ఏర్పాటైతే వాటన్నిటిని తనిఖీ చేయడానికి గాని, ఆ స్వతంత్ర సంస్థలకు సలహాలివ్వడానికి గాని రాష్ట్ర ప్రభుత్వానికి సాధ్యమౌతుందా!

శ్రీ భక్తవత్సలు :

దుర్గయ్యగారూ! మీరు చెప్పేమాటఒప్పుకుంటాను కాని ఇప్పుడు సాముదాయక అభివృద్ధి ప్రణాళికల పరిశీలన సంఘమువారు జిల్లా పరిపాలనను మూడు యూనిట్లతో ఏర్పచాలని సిఫార్సు చేశారు. ఆ ప్రకారం గ్రామస్థాయిలో శక్తిమంతమైన గ్రామ పంచాయతీ, బ్లాకు స్థాయిలో పంచాయతీ సమితి, జిల్లా స్థాయిలో జిల్లా పరిషత్తు, ఇవి ఉంటాయి. ఈ విధముగ ఆ కమిటీవారు జిల్లా పరిపాలనకు గూడ తగుసలహాల నిచ్చారు. బ్లాకు సమితి పైన జిల్లా పరిషత్తును గూడ ఏర్పాటు చేయడం వల్ల ప్రతి చిన్న విషయాన్ని తనిఖీ చేయవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానికి ఉండదు. జిల్లా పరిషత్తు నిర్మాణమైన తరువాత మూలసిద్ధాంతాలకు సంబంధించిన విషయాలలోనే రాష్ట్ర ప్రభుత్వం శ్రద్ధ తీసుకుంటుంది.

శ్రీ మూర్తి :

ఈ కొత్త మార్పు ఎంత గొప్పదైనా కాని వ్వండి. అసమర్థతకు దారి తీస్తుందని నాకు సందేహంగా ఉన్నదండీ-భక్తవత్సలుగారూ!

శ్రీ భక్తవత్సలు :

మూర్తిగారూ! ప్రస్తుత ప్రభుత్వ యంత్రాన్ని వికేంద్రీకరించడం ఆదిలో అసమర్థతకు కారణమవుతుందనే విషయం వాస్తవమే. కాని, కాలక్రమేణా ప్రజాస్వామ్యము, వికేంద్రీకరణ పద్ధతి విజయము సాధించి తీరవలసినదే. అందుచేత మొదట కొన్ని లోపాలున్నప్పటికీ అవి తాత్కాలికముగ మాత్రమే ఉంటాయి. సాముదాయక అభివృద్ధి కార్యక్రమాల మూల సిద్ధాంతం సాంఘికాభివృద్ధి అంతా స్థానిక ప్రజల చేతనే జరుగాలని కదూ! ప్రజలే ఈ ఉద్యమాన్ని చేబూనితే గాని అది విజయవంతముగాదు. ప్రజలలో ఉత్సాహం, శ్రద్ధాసక్తులు కలిగించాలంటే వారి అభివృద్ధి కార్యక్రమాలకి ప్రజలనే బాధ్యులనుగా జేయాలి. సాముదాయక

అభివృద్ధి కార్యక్రమాన్ని గట్టి పునాదులపైన నడప డానికి శాశ్వతమైన సంస్థలను సృష్టించ వలసిన అవసరాన్ని గూర్చి తన మొదటి పరిశీలన నివేదికలో ఆచార్య. డి. జి. కార్వేగారు ప్రాముఖ్యంగా వ్రాశారు. ప్రజల సహకారాన్ని, సానుభూతిని విశేషముగా పొందడానికి చాల కాలమునుండి వాంఛిస్తున్న ఈ సంస్థలను ఇప్పుడే నిర్మించాము. ప్రజలప్పుడే ఈ నూతనపద్ధతుల కనుగుణంగా వ్యవహ రిస్తున్నారు.

శ్రీ దుర్గయ్య :

డా॥ కారల్ సి. టేలర్ గారు మనదేశ సాము దాయక అభివృద్ధి కార్యక్రమాన్ని చక్కగా పరిశీలన జేసి స్థానిక సంస్థలను గూర్చి వ్రాస్తూ "గ్రామ పంచాయతీలకు ఎన్నుకోబడిన పెద్దలు స్వచ్ఛందమైన గ్రామనాయకులు కాలేక పోతున్నారు. పంచా యితీ ఎన్నికలు గ్రామాలలో కక్షలకు దారితీసి మరికొంత కాలమువరకు అభివృద్ధి పనులకు ప్రతి బంధకాన్ని కలిగిస్తున్నాయని" అన్నారు. అందు బట్టిచూస్తే, మూర్తిగారు చెప్పినట్లు ఈ నూతన పంచాయితీ సమితిలు అసమర్థమగుటయేగాక, అవినీతికిగూడ పాల్పడవా!

శ్రీ భక్తవత్సలు :

అవినీతికి కారణాలు అనేకం. నానావిధాలు. ప్రజల అజ్ఞానం, అనేకమందికి అధికారాన్ని అప్ప గించడంచేత బాధ్యత తగ్గిపోవడం, అధికారం కొద్ది మంది చేతిలో కేంద్రీకరించ బడుటచేత కొన్ని ప్రత్యేక హక్కులు గల వర్గాలు ఏర్పడడం-వీటన్నిటి మూలమున గాని లేక ఏపై ఒక్క కారణముచేత గాని అవినీతికి ఆస్కారం ఏర్పడుతుంది. అయితే ప్రజలు జాగ్రత్తగలిగి తెలివితేటలు గలవారై యున్న లైయితే ఈలోపాలాన్నిగూడ తొలగించవచ్చు. పరి పాలనలో ప్రజలకెక్కువ సంబంధమున్నలైయితే సాధారణముగ అవినీతి చాలతక్కువగా ఉంటుంది. పంచాయితి సమితి పరిపాలనలో ఈ లాభము ఉంది. పంచాయితి సమితి పరిపాలనలో ప్రజాభిప్రాయం చాల బలవత్తరమైనది కనుక ఈ అవినీతి కార్య క్రమాలు చాలకాలము జరుగడానికి వీలుండదు.

శ్రీ మూర్తి :

సరేనండి భక్తవత్సలుగారూ! ప్రస్తుతం బ్లాకు అభివృద్ధి ప్రణాళిక కమిటీ యున్నది గదా! వేరే నూతన పరిపాలనా విధానాన్ని ప్రవేశ పెట్టుట కంటె, ఆ కమిటీకే ఎక్కువ అధికారాలను అప్పగిస్తే సరిపోదూ!

శ్రీ భక్తవత్సలు :

మూర్తిగారూ! అధికారాన్ని ఒకరినుండి మరొకరికి మార్చుటకును, వికేంద్రీకరణ పద్ధతికిని చాల భేదాయున్నది. అధికారాన్ని ఇతరుల కిచ్చి నప్పటికిని మొత్తము పైన ప్రభుత్వము తన బాధ్య తను మాత్రము త్రోసి పుచ్చజాలదు. అయితే వికేంద్రీకరణ పద్ధతిలో ప్రభుత్వానికి కొన్ని విధులు, బాధ్యతలు పూర్తిగా తప్పిపోతాయి. బ్లాకు స్థాయిలో ఏదైన ఒక సంస్థ ఉత్సాహముగా, శక్తివంతముగా, విజయవంతంగా పనిచేయాలంటే ఇంత మాత్రము వికేంద్రీకరణ తప్పనిసరి అవసరం. మరొక ముఖ్య విషయ మేమిటంటే ఈ పంచాయితీ సమితులలో ఆ ఆ బ్లాకులలోని అన్ని పంచాయితీలు కూడి యున్నవి. ఆ సమితి సభ్యులు అన్ని విషయాలను క్షుణ్ణంగా అర్థం చేసుకోడానికి, వారి పలుకుబడి ప్రతి బింబంగా కనబడడానికి వీలుగా ఉండేటట్లు [illegible] ప్రాంతం ఆ సమితిల క్రింద ఉంటుంది.

శ్రీ దుర్గయ్య :

ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పద్ధతిని గూర్చి ఇప్పుడు ఆలోచించుటెందుకు? ప్రస్తుతం ప్రభుత్వ యంత్రాంగం ప్రజాస్వామ్య పద్ధతికేమైనా భిన్నంగా ఉన్నదా?

శ్రీ యల్. భక్తవత్సలు :

అది కాదండి. ప్రస్తుత ప్రభుత్వం ప్రజాస్వామ్య సిద్ధాంతాలపైననే నడుస్తున్నది. గనుకనే అధికా రాన్ని, బాధ్యతలను వికేంద్రీకరణ జేయాలని తల

పెట్టినది. ప్రజా ప్రభుత్వం ఎక్కువ ప్రదేశాన్ని పాలించేటప్పుడు స్థానిక సంస్థలను సమగ్రంగా అర్థముచేసికో జాలదు. అందుచేత ఆ ఆ ప్రాంతంలో పేరు పొందిన ప్రజా ప్రతినిధుల ఆధ్వర్యమున నడుచునట్టి యంత్రాంగాన్ని కల్పించడం చాల అవసరమైంది.

అంతేనండి మూర్తిగారూ! మొట్ట మొదట బహ్మాండమైన ప్రయోగమేమిటంటే బ్లాకులను, ప్రాజెక్టులను ప్రారంభంచేయడం "కిందపడ్డాం. క్రింద పడినందున మరల పైకి లేవగలిగాము. పైకి లేచినప్పటి నుంచి గమ్యస్థానాన్ని చేరుకోడానికి ముందుకు సాగిపోతూ ఉన్నాం," అని పండిత నెహూ్రు ముచ్చటగా ఒక చిన్న ఉర్దూ పద్యంలో చెప్పారు. ఇప్పుడు ఈ పంచాయతి సమితీలను ఏర్పాటుచేయడం రెండవ ప్రయోగం. దేశంలో అన్ని రాష్ట్రాలకంటె ముందుగ ఈ గొప్ప ప్రయోగానికి పూనుకొనే భాగ్యం మనకు కలిగింది. అక్కడక్కడ ఏవో కొన్నిలోపాలు ఉండవచ్చు. వాటన్నింటిని తప్పుకోవచ్చు. శ్రేయోదాయక రాజ్యాన్ని సాధించడం, అంత సులభమైన పని కాదు. ఒక కార్యక్రమాన్ని చేస్తూ అనేక విషయాలను అనుభవముపైన నేర్చు కొంటాము. అయితే ప్రజలు దీక్షతో కృషి చేయాలి.



అభిప్రాయ వేదిక :

# జాతీయ భాషగా తెలుగు

1958 ఏప్రిల్ 27వ తేదీ 'హిందూ' వారమాగ్గజైన్‌లో భారతదేశంలో భాషా సమస్యనుగురించి చర్చిస్తూ ప్రొఫెసర్ జె. బి. ఎస్. హాల్డేన్ యిలా అన్నారు.

"హిందీ విజయం పరిస్థితుల కనువుగా అది మారడంపై ఆధారపడి వుంటుందనీ, దానిని 'అమి శ్రమం'గా వుంచడానికి ప్రయత్నించేవారు ఇండియాలో ప్రజలందరూ దానిని నేర్చుకునే అవకాశాన్ని మరీమరీ తగ్గిస్తున్నారనీ నానమ్మకం". ఆయన యింకా యిలా అన్నారు. "హిందీవాదులు రాజీకి సంసిద్ధులుగావుంటే ఆ భాష భారతీయులందరికీ రెండవ భాష మాత్రమే కాగలదు. వారెంత ప్రయత్నించినా అది మారక మానదు. విదేశాలలో తయారైన వస్తువులను దేశం అవతల ఆపినట్టుగా విదేశీ మాటలను ఆపడం సాధ్యంకాదు. భారతీయ భాషలన్నిటిలోను వాటిని యెక్కువ సులభంగా అంగీకరించే భాష బహుశా తెలుగు భాష. ఈ కారణం చేత, విజ్ఞాన శాస్త్రం, వైద్య, ఇంజనీరింగు విద్యలను బోధించుటలో అది హిందీతో పోటీపడే అవకాశం తప్పక యేర్పడుతుంది."

ఆయన వెలిబుచ్చిన యీ అభిప్రాయాన్ని పత్రికా ప్రపంచం హర్షించింది. ఆ తరువాత యీ విషయంలో చాలమంది ప్రముఖులు తమతమ అభిప్రాయాలను వెల్లడించారు.

డా. జి. హోమ్‌ఫీల్డు మెక్‌లాయిడ్, పి. హెచ్.డి., ఐల్‌వర్తు (మిడిల్‌సెక్సు, ఇంగ్లండు) 16-7-58 తేదీ 'హిందూ'లో యిలా వ్రాశారు :

"భారతీయ విజ్ఞాన శాస్త్రం, వైద్య విద్యలకు తగిన భాషగా పెంపొందే అవకాశం తెలుగుకు కలదని ప్రొఫెసర్ జె. బి. ఎస్. హాల్డేన్ (మీ పత్రికలో) చేసిన సూచన చాలా సరియయినది. తెలుగును దక్షిణాది భాషలలో మిక్కిలి వుత్తరానగల భాషగా కాని లేక వుత్తరాది భాషలలో మిక్కిలి దక్షిణాన గల భాషగా కాని పరిగణించవచ్చు. దానికి యీ రెండు వర్గాల భాషలకుగల సల్లక్షణాలు వున్నాయి. దానిలో ఒక వేళలోపాలు యేమేనావుంటే అవి బహుస్వల్పం. దానిని పరిస్థితుల కనుగుణంగా మార్చవచ్చు. అది జీవభాష. ఇతర భాషలను తనలో లీనం చేసుకోగలదు. వ్యాకరణ గీత్వాసులభమైనది. అది చాలా శ్రావ్యమైన భాష. విదేశీపదాలను వాడుతున్నా అదిశ్రావ్యంగానే వుంటుంది. అది యెన్నడూ సంకుచితమైన రాష్ట్రీయవాదానికి లోనుగాలేదు.

"ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రయత్నిస్తే, భారతీయ విజ్ఞాన శాస్త్రం, ఇంజనీరింగు, వైద్యాలను శక్తివంతంగా నడిపే మహాభాష భారతదేశానికి కలదని ఋజువుపరచే అవకాశం వున్నది. పశ్చిమ దేశాల శాస్త్రీయ భాషతో సరితూగగల సామర్థ్యం తెలుగు భాషకు కలదనడంలో సందేహం లేదు. అంగలలో దాని అభివృద్ధిని సాధిస్తే పేలవమైన ప్రస్తుతపు భాషావివాదం సమసిపోగలదు. తమకుగల మహాసంపదను భారతదేశానికి యివ్వడంలో ఆంధ్రులు వెనుకబడకూడదు."

మిస్టర్ జాన్ ఆర్. టీవింకిల్, ఇలియనాయిస్, అమెరికా 1958 జూన్ 1వ. తేదీ 'హిందు'లో యిలా వ్రాశారు.

"భారతదేశం తన అధికార భాషయయిన హిందీలో తెలుగు, తమిళం, మలయాళం, కన్నడ భాషల ప్రత్యేకఆలోచనా పద్ధతుల్ని ప్రవేశపెట్టడం,

ఇండో-యూరోపియన్ భాగాన్ని సడలించడం మానవజాతి భవిష్యత్తు దృష్ట్యా అవసరమని నాకు తోస్తున్నది. అయితే బర్మీసు, బంటు, ఇండోనీసియన్, గ్యూయూ, ఇంగ్లీషుభాషల పదాలను స్వీకరించవచ్చు. కేవలం తమిళం మాట్లాడే జ్ఞానంతో దాని వ్యాకరణంలో యెంత అద్భుతమైన క్రమమున్నదో నాకు అర్థమయింది. తెలుగు ఒకవేళ అంత శ్రావ్యమైన భాష అయితే తెలుగు పదాలను పూర్తిగా హిందీలో లీనం చేయాలి. సృజనాత్మకమైన భాషకు క్రమం, శ్రావ్యత, సంతృప్తత వుండాలి."

బొబ్బిలి వాస్తవ్యులైన శ్రీ జి. సేహేంద్రశర్మ 11-5-58 న 'హిందూ'లో యిలా వ్రాశారు.

"పూర్వం ఒక ప్రసిద్ధ యూరోపియన్ భాషావేత్త తెలుగును తూర్పుదేశాల ఇటాలియన్ అని అన్నాడు. ఈనాడు మళ్ళీ అది అట్టి ప్రముఖ యూరోపియనే అయిన ప్రొఫెసర్ జె.బి.ఎస్. హాల్డేన్ దృష్టిని ఆకర్షించింది. ఈ మధ్య ఆయన 'హిందూ' వారమాగజైన్‌లో వ్రాస్తూ తెలుగు విదేశీపదాలను 'ఇతర భారతీయ భాషలకంటే యెక్కువ సులభంగా' అంగీకరిస్తుందని అంటూ, 'ఇందువల్ల విజ్ఞానశాస్త్రం, వైద్య, ఇంజనీరింగు విద్యల బోధనలో హిందీతో పోటీపడగల అవకాశం దానికి లభించగలదు' అని అన్నారు. నిష్పక్షపాతియయిన భారతీయేతరుని నుంచి యీ మాటరావడం వల్ల దానికి చాలా ప్రాముఖ్యమున్నది. భాషావాదంలో ఆసక్తిగల దేశీయులందరూ దానిని గురించి జాగ్రత్తగా ఆలోచించాలి. చెవికి యింపుగా వుండడం, మారే పరిస్థితుల కనుగుణంగా మార్పు చెందగల శక్తి యీ రెండు గుణాలవల్ల తెలుగు మిగిలిన భారతీయ భాషలకంటె విశిష్టతను సంపాదించినది అన్న విషయం యిప్పుడు సుస్పష్టమయింది.



# ఆంధ్రప్రదేశ్ ఎగువ సభసభ్యులు.

## స్థానిక అధికారుల నియోజక వర్గాలు

### ఉత్తర సర్కారు

1. శ్రీ అప్పసాని అప్పనదొర కమ్మవీధి, విజయనగరం.

2. శ్రీ కొమ్మూరు అప్పడు, భోగపురం గ్రామం, భీమునిపట్నం తాలూకా విశాఖపట్నం జిల్లా.

3. శ్రీ త్రిపురాన రాఘవదాసు, సిద్ధాంతం, పోస్టు, శ్రీ కాకుళం జిల్లా.

4. శ్రీ పెంటకోట వెంకటరమణ, ప్రెసిడెంటు, ముకగపాక పంచాయతీ అనకాపల్లి తాలూకా.

### మధ్య సర్కారు

5. శ్రీ ఉండవిల్లి సత్యనారాయణ మూర్తి, రాయవరం (వయా) అనపర్తి, రామచంద్రపురం తాలూకా.

6. శ్రీ తుమ్మలపల్లి వీరాభద్రరావు, పిప్పర (వయా) పెంటపాడు, పశ్చిమ గోదావరి జిల్లా.

7. శ్రీ రుద్రరాజు రామలింగరాజు, సఖినేటి పల్లి, రాజోలు తాలూకా, తూర్పుగోదావరి జిల్లా.

8. శ్రీ శంకు అప్పారావు. జిల్లా కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు, అగ్రహారం, ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా.

### దక్షిణ సర్కారు

9. శ్రీ కొల్ల వెంకయ్య,. కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు, బాపట్ల, గుంటూరు జిల్లా.

10. శ్రీ పెల్లేటి వెంకటకృష్ణారెడ్డి, గూడూరు, నెల్లూరు జిల్లా.

11. శ్రీ పొన్నలూరు వీరరాఘవరెడ్డి, గూడూరు టవున్, గూడూరు తాలూకా, నెల్లూరు జిల్లా.

12. శ్రీ బొజ్జ ఆదినారాయణరావు, గురజాల, పల్నాడు తాలూకా, గుంటూరు జిల్లా.

13. శ్రీమతి మానికొండ సూర్యావతి కె/ఆ. కడియాల గోపాలరావు హనుమంతరాయనగరు, విజయవాడ-2.

14. శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణరావు: దుగ్గిరాల పోస్టు, తెనాలి పోస్టు, గుంటూరు జిల్లా.

### రాయలసీమ

15. శ్రీ ఆదికేశవులు నాయుడు, కె., మంగిలిపట్ట బి.ఓ. (వయా) చంద్రగిరి, చిత్తూరుజిల్లా.

16. శ్రీ దప్పిలి పాండురంగారెడ్డి, ప్రెసిడెంటు, పంచాయతీ బోర్డు, గిద్దలూరు, కర్నూలు జిల్లా.

17. శ్రీ నారాయణరెడ్డి, డి., అడ్వొకేటు కడప. తాలూకా.

18. శ్రీ యెద్దుల ఈశ్వరరెడ్డి, పెద్దపసుపుల పోస్టు, జమ్మలమడుగు తాలూకా, కడప జిల్లా.

19. శ్రీ రాజువెంకటసుబ్బారెడ్డి, రామనపల్లి పోస్టు, కడప తాలూకా.

20. శ్రీ షెర్ఫుద్దీన్, కె, వైస్-ఛైర్మన్, మునిసిపల్ కౌన్సిల్ అనంతపురం.

### దక్షిణ తెలంగాణ,

21. శ్రీ ఎర్రం సత్యనారాయణ. 4-4-68, తిలక్ రోడ్, సుల్తాన్ బజారు

22. శ్రీ గురువారెడ్డి. 3-4-440, నారాయణగూడ, హైద్రాబాదు నగరం.

23. శ్రీ రామచంద్రారెడ్డి, మమ్మాయిపల్లి (వయా) గోపాలపేట మహబూబునగరు జిల్లా.

24. శ్రీ వెంకటనరసింహాచారి, తూ పాన్, గజ్వేలు తాలూకా మెదకు జిల్లా.

25. శ్రీ శీలంసిద్ధారెడ్డి, బనిగండ్లపాడు, మధిర తాలూకా, ఖమ్మం జిల్లా.

26. శ్రీ సుబ్రహ్మణ్యాం, కొల్లాపూరు, కొల్లాపూరు తాలూకా మహబూబునగరం జిల్లా.

## ఉత్తర తెలంగాణ

27. శ్రీ రఘోత్తమరెడ్డి, 5-10-173, ఫతేమైదాన్, హైద్రాబాదు.

**28. శ్రీ హనుమంతరెడ్డి, జిల్లా భారత సేవక సమాజ్, నిజామాబాదు.**

29. శ్రీ ఈపూరు లక్ష్మారెడ్డి, గూడూరు గ్రామం, నరసంపేట తాలూకా, వరంగలు జిల్లా.

30. శ్రీ మొహమ్మద్ ఆరిఫ్ ఖాన్, ప్లీడర్ ఆదిలాబాదు జిల్లా కాంగ్రెసు కమిటీ, ఆదిలాబాదు

31. శ్రీ గంగారాం, కె/ఆ. కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు బెల్లంపల్లి పోస్టు, ఆదిలాబాదు జిల్లా.

## పట్టభద్రుల నియోజక వర్గాలు సర్కార్లు

32. శ్రీ యస్. బి. పి. బి. కె. సత్యనారాయణ రావు, దివానంవారివీధి, కపిలేశ్వరపురం. ఆలమూరు సబ్-తాలూకా తూర్పుగోదావరి జిల్లా.

33. శ్రీ అవసరాల రామారావు అడ్వొకేటు, అల్కాట్ గార్డెన్సు. రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా.

34. శ్రీ ములుకుట్ల వెంకటశాస్త్రి, ఇంటి నెం. 3/1538, ములుకుట్ల అచ్యుతరామయ్య వీధి, రామారావు పేట, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా.

## రాయలసీమ

35. శ్రీ నివర్తి వెంకటసుబ్బయ్య, జర్నలిస్టు, నంద్యాల, కర్నూలు జిల్లా.

36. శ్రీ కృష్ణారెడ్డి, ఎం. వి. 78, కాపువీధి, నెల్లూరు.

## తెలంగాణ

37. శ్రీ అతాపుర్ రహమాన్, 8-2-420, బంజారాహిల్స్, హైద్రాబాదు.

38. శ్రీ ఆనందం, యం. 96-III, మెయిన్ రోడ్డు, మారేడుపల్లి సికింద్రాబాదు.

39. శ్రీ మతి సీతామహాలక్ష్మి. జె. 3-6-776 హిమాయతునగరు, హైద్రాబాదు.

## ఉపాధ్యాయుల నియోజక వర్గాలు, సర్కారు

40. శ్రీ రామమూర్తి, పి. యల్. టీ. అసిస్టెంటు. బోర్డు హైస్కూలు, గొల్లపల్లి, కృష్ణాజిల్లా.

41. శ్రీ దేశరాజు సత్యసుబ్రహ్మణ్యాం, ప్రిన్సిపాలు, శ్రీ సి. ఆర్. రెడ్డి కాలేజి, ఏలూరు.

42. శ్రీ వెంపటి పురుషోత్తం, రిటైర్డు హెడ్మాస్టరు, వినయసదనం, శివాలయం వీధి, సత్యనారాయణ పురం, విజయవాడ-2.

43. శ్రీ గుమ్మళ్ళ రంగారావు నాయుడు. కె/ఆ. డా. జి. యస్. ప్రకాశరావు, ఎం.బి.బి.ఎస్., అసిస్టెంటు ప్రొఫెసరు, మెడికల్ కాలేజి, గుంటూరు.

## రాయలసీమ

44. శ్రీ సింగరాజు రామకృష్ణయ్య, 16/506, కస్తూరినగర్, నెల్లూరు.

45. శ్రీ సుబ్బశాస్త్రి 44/153 ప్రకాశనగరు. కర్నూలు.

## తెలంగాణ

46. శ్రీ కొండపర్తి మనోహరరావు, కపిడికొండ గ్రామం, వరంగలు తాలూకా, వరంగలు జిల్లా.

47. శ్రీ కాళోజి నారాయణరావు, 3-4-685 నారాయణ గూడ, హైద్రాబాదు.

## శాసనసభ సభ్యులచే ఎన్నుకోబడిన సభ్యులు

48. శ్రీ అబుయూసఫ్, బజారు, నూరుల్ ఉమా సి. ఐ. బి. క్వార్టర్సు ఎ-క్లాసు, నెం. 9 హైద్రాబాదు

49. శ్రీ అరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి పోస్టు కొలను పాక, భోనగిరి తాలూకా, నల్గొండ జిల్లా.

50. శ్రీ ఈదుకల్లు సదాశివన్ 2/125, ఎక్స్ టెన్షన్స్, అనంతపూరు,

51. శ్రీ గుంటూరు బాపనయ్య నాగయతిప్ప దివి తాలూకా, కృష్ణా జిల్లా.

52. శ్రీ గుట్టా రాజారావు, గోడవర్రు, వయా కనికిపాడు, కృష్ణా జిల్లా.

53. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, ఘంటశాల పోస్టు, దివి తాలూకా, కృష్ణా జిల్లా.

54. శ్రీ గొర్రెపాటి బుచ్చి అప్పారావు, విజిని గిరి, శృంగవరపుకోట తాలూకా, విశాఖపట్నం జిల్లా.

55. శ్రీమతి జి. భారతీదేవి నిడుబ్రోలు పోస్టు, గుంటూరు జిల్లా.

56. శ్రీ చిన్నశివారెడ్డి, గార్గేయపురం, కర్నూలు జిల్లా.

57. శ్రీ చీకటి పరుశురాం నాయుడు, అడ్వో కేటు, పార్వతీపురం, శ్రీ కాకుళం జిల్లా

58. శ్రీ జగన్నాథం, యస్. వి. ఇంటి నెం. 732, రైలుపటేలు ఇల్లు, సుల్తాన్ షాహి, హైద్రాబాదు.

59. శ్రీ దామర్ల రమా కాంతరావు, మంగళ గిరి, గుంటూరు జిల్లా.

60. శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, భీమ వరం పోస్టు, పశ్చిమగోదావరి జిల్లా.

61. శ్రీ నాగిరెడ్డి, జె. సి., తాడిపత్రి అనంత పూరు, జిల్లా.

62. శ్రీ నథానియల్ మిల్హారి విల్లియమ్సు, మిషను కాంపౌండు, రేణిగుంట, చిత్తూరు జిల్లావి.

63. శ్రీ పైడా వెంకటనారాయణ, జవహర్ వీధి. కాకినాడ.

64. శ్రీ ప్రతాపరెడ్డి, కే. వి. కే/అ. శ్రీ కే. కే. రెడ్డి, బి-14/300, న్యూ ఆగపూరా, హైద్రాబాదు.

65. శ్రీమతి ఫయిజున్నిసా, "జాస్ మైన్ కాటేజి" 3-6-106/1, హిమాయతునగరు, హైద్రాబాదు.

66. శ్రీ బాచిన సుబ్బారావు, చింతగంపల్లి పోస్టు గొనసపూడి,ఒంగోలు తాలూకా, గుంటూరు జిల్లా.

67. శ్రీ బెండి కూర్మన్న, సీతాపురం, పోస్టు టెక్కలి, శ్రీ కాకుళం జిల్లా.

68. శ్రీ బెజవాడ పాపిరెడ్డి, పోస్టు బుచ్చిరెడ్డి పాలెం, నెల్లూరు జిల్లా.

69. శ్రీ భోజరెడ్డి, 4-5-477, సుల్తానుబజారు, హైద్రాబాదు నగరం.

70. శ్రీ మంథెన వెంకటసూర్యసుబ్బరాజు, గంటి పెదపూడి, కొత్తపేట తాలూకా, తూర్పుగోదావరి జిల్లా.

71. శ్రీ మఖ్దూం మొహియుద్దీన్. ఉరుదుగల్లి ఆబిదురోడ్డు. హైద్రాబాదు.

72. శ్రీ మాడపాటి హనుమంతరావు, "ఆంధ్ర కుటీర్" హనుమాన్ టేక్డి హైద్రాబాదు-1.

73. శ్రీ రావు అచ్చయ్యా రావు, పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా.

74. శ్రీ రాణువ సీతారామయ్యా, పెనుకల పాడుగ్రామం, రాజుల గురునాయపల్లి పోస్టు, జమ్మలమడుగు తాలూకా, కడప జిల్లా.

75. శ్రీ లింగయ్యా, దుబ్బాక పోస్టు, సిద్దీపేట తాలూకా, మెదకు జిల్లా.

76. శ్రీ సుబ్బారెడ్డి, ప్రెసిడెంటు, జిల్లా కాంగ్రెసు కమిటీ, కర్నూలు.

77. శ్రీ సూర్యనారాణరావు వై 147/332 రాంగోపాలపేట, సికింద్రాబాదు.

78 శ్రీ షేక్‌గాలిబ్, సంగడిగుంట, గుంటూరు

## గవర్నరు నామినేటు చేసిన సభ్యులు

79 శ్రీ యస్. గోవిందరాజులు, వైస్-ఛాన్సలర్, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి.

80 శ్రీ బి. యన్ రెడ్డి, డైరెక్టరు, వాహిని ప్రొడక్షన్సు, "బొమ్మిరెడ్డి హౌస్" న్యూ బోగ్ రోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు

81 శ్రీ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, తెలుగు శాఖాధ్యక్షులు యస్ ఆర్ ఆర్ మరియు సి. వి. ఆర్ కాలేజి విజయవాడ

82. శ్రీ బిక్కిని వెంకటరత్నం, చోడవరం రామచంద్రపురం తాలూకా, తూర్పుగోదావరి జిల్లా

83 శ్రీ జి సుబ్బరాజు, యం యస్ (కాలిఫోర్నియా) యఫ్. ఎ., యఫ్. పి ఇ (అమెరికా) మేనేజింగు డైరెక్టరు, సౌత్ ఇండియా రీసర్చి ఇన్స్టిట్యూట్. విజయవాడ,

84, శ్రీ యస్. శంభు ప్రసాదు, ఎడిటర్, ఆంధ్ర పత్రిక, మద్రాసు,

85. శ్రీమతి కె రామ సుబ్బమ్మ, సలపేట, కడప.

86. శ్రీ పి. వెంకటరావు బి. ఎ, గాంధి భవన్, హైద్రాబాదు.

87. శ్రీ జైన్. యార్జంగ్ బహదుర్, హిమాయతునగరు, హైదార్బాదు

88 శ్రీ అర్నెస్ట్ గిడియన్ బి ఎ. (ఆనర్సు) (ఆక్సుఫర్డు) ప్రిన్సిపాలు, వెస్లీ హైస్కూలు, ప్రెండర్ గాస్ట్‌రోడ్డు, సికింద్రాబాదు

89 శ్రీ హారూన్‌ఖాన్ షేర్వానీ, ముస్తఫా మంజిల్, హిమాయతునగరు. హైద్రాబాదు.

90. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, వరకోట గార్డన్సు, టోలిచౌక్ (గోల్కొండ సమీపంలో) హైద్రాబాదు



కర్నూలులోని కాశిరెడ్డి వెంకటరెడ్డి స్త్రీల కళాశాల (దీనిని ఋటీవల రాష్ట్రముఖ్యమంత్రి ప్రారంభించారు)



హైదరాబాదు పౌరోద్యానాలలో 'రాణి'

# ఏనుగ 'రాణి'

మద్రాసు రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ పిల్లలకు 'రాణి' అనే యేనుగను బహూకరించింది.

ఆంధ్రప్రదేశ్ నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి స్వయంగా కోరినమీదట మద్రాసు రాష్ట్రం ఆ యేనుగను యివ్వడం జరిగింది. అది కోయంబత్తూరు నుంచి హైదరాబాదుకు పంపబడింది.

ఆ యేనుగ 18-10-1954న పట్టుకో బడింది. 1957 లో దాని యెత్తు 6 అ. 14-2-58 న కొలిస్తే అది 6 అ. 1 1/2 అం. యెత్తున్నది.

దానికి యిప్పుడు యెనిమిది సంవత్సరాలున్నాయి. మద్రాసు ప్రభుత్వపు అటవీ శాఖకి అది తేలిక పనులు చేస్తూవుండేది. ఇకముందు అది తనతిండి తాను సంపాదించుకో గలదు. అది హైదరాబాదు జంతు ప్రదర్శన శాలలో ప్రత్యేకం పిల్లల విభాగంలో అది వుపయోగించ బడుతుంది.

—:o:—

# ప్రపంచ వ్యవసాయ ప్రదర్శనం

1959 సంవత్సరం వెళ్లబోయే సమయంలో న్యూఢిల్లీలో అంతర్జాతీయ స్వభావంగల "ప్రపంచ వ్యవసాయ వస్తుప్రదర్శన సంత" యేర్పాటు చేయబడుతుంది. ప్రపంచ చరిత్రలో యిటువంటి సంత జరుగుట కిదే మొదలు. ఇది రెండు ప్రయోజనాలతో జరుపబడుతున్నది మొదటిది, దేశంలోను, విదేశాలలోను వ్యవసాయ శాస్త్రంలో వచ్చిన క్రొంగ్రొత్త అభివృద్ధులను గురించి భారతీయ రైతులకు తెలియచెప్పడం. రెండవది, ఉపయుక్తమైన భారతీయ వ్యవసాయ జీవితాన్ని, తత్పురోగమనాన్ని ప్రపంచానికి ముఖ్యంగా దీనిలో పాల్గొనే దేశాలకు చూపించడం.

ఈ సంత ప్రధానాంశాలలో వస్తు ప్రదర్శనగా వుండగలదు. అక్కడ బోధనాత్మకమైన ప్రదర్శనలు జరిపి తద్వారా ప్రపంచ ప్రజలు ఆహార కొరతను యెదుర్కొనుటకు నిరంతరం యెలా పాటుపడుతున్నారో, క్రమేపీవారు తమ కృషిలో యెలా విజయం చెందుతున్నారో భారతీయ రైతులకు తెలియచేయబడుతుంది. ఆవిధంగా వారు భారత దేశ ప్రజావసరమైన ఆహారాన్ని, నూలును యితోధికంగా ఉత్పత్తి చేయుటకు సర్వ సన్నద్ధులై వుంటారని ఆశించ బడుతున్నది.

ఈ సంత న్యూఢిల్లీలో అంతర్జాతీయ రైతు మహామండలి యేకాదశ వార్షిక సమావేశము, ప్రపంచ రైతు సహకార సంస్థ సమావేశము జరిగే సమయంలో జరిగే యేర్పాటు చేయబడింది. అది 1959 డిసెంబరు మూడవ వారంలో ఆరంభమై 6-8 వారాలు జరుగుతుంది. అవసరమైతే అది మరొక వారమో లేక రెండు వారాలు పొడిగించ బడవచ్చు.

దీనిని సంకల్పించినది భారత్ కృషక్ సమాజ్. ఇది భారతదేశంలోని రైతులందరికీ ప్రాతినిధ్యం వహించే సంస్థ. ప్రపంచ మంతటా గల రైతు సంస్థలతో దీనికి సన్నిహితత్వమున్నది.

ఈ సంత యేర్పాటుకు యీ సమాజ్‌కి పూర్తి సహకారాన్నిచ్చుటకై కేంద్ర ఆహార, వ్యవసాయ మంత్రిత్వశాఖ హామీయిచ్చింది.

ఈ సంత యించుమించు 80 యెకరాల విస్తీర్ణంగల మధురారోడ్డు ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో జరుగుతుంది.

## విభాగాలు

ఈ సంత 5 విభాగాలుగా విభజించ బడుతుంది. మొదటిది విదేశ విభాగం. ఇందులో ప్రపంచంలోని వివిధ దేశాలు తమ తమ స్వంత ప్రదర్శనలు యేర్పాటు చేసుకొనుటకు ఆహ్వానించ బడుతాయి

రెండవది, వ్యవసాయ విభాగం. ఇందులో మళ్లీ వివిధ విభాగాలుంటాయి. వాటిలో ఒక్కొక్క దానిలో దేశంలో వ్యవసాయం, తోటపని, పశుపోషణ, అటవీసంపద, సహకారం మున్నగు రంగాలలోసాధించబడిన అభివృద్ధికి సంబంధించిన విషయాలు ప్రదర్శింప బడతాయి.

మూడవ విభాగం గ్రామీణ పరిశ్రమలు, వ్యవసాయానికి సంబంధించిన తదితర పరిశ్రమలకు చెందిన విషయాలకు కేటాయించ బడుతుంది.

నాలుగవది, ఆహార విభాగం, ఇక్కడ ఆహారం ప్రోసెసింగు, టెక్నాలజీ పౌష్టికాహారం విషయాలలో సాధించిన అభివృద్ధికి సంబంధించిన విషయాలు ప్రదర్శింప బడతాయి.

అయిదవది, మార్కెటు విభాగం. ఇక్కడ రైతులకు అవసరమైన అన్నిరకాల భారతీయ వస్తువులూ ప్రదర్శింప బడడమేకాక అవి అమ్మబడతాయి కూడా. మామూలు ప్రదర్శనకి తోడు పశువుల పరిదర్శనం కోళ్లు, గొర్రెలు, పుష్పాలు, ఫల ప్రదర్శనలు, మత్స్యసంపద ప్రదర్శనలు కూడా జరుగగలవు.

వినోద కాలక్షేపానికి కూడా ప్రత్యేకం యేర్పాట్లుంటాయి. అందుకు అంతర్జాతీయ ఫోక్ థియేటరు, వినోదపు పార్కు యేర్పాటు చేయబడతాయి. ఈ సందర్భంలో గ్రామీణ ఫిల్ముల వుత్సవం జరుప బడాలని కూడా సంకల్పించ బడింది.

ఈ సంత యేర్పాటు విషయంలో, కేంద్ర సహకార శాఖామంత్రి అధ్యక్షతన యించుమించు 80 మంది సభ్యులతో ఒక కమిటీ యేర్పాటు చేయ బడింది. ఈ సంతకార్యాలయం న్యూఢిల్లీలోని మధురా రోడ్డులోని ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో (లోకాస్టు హౌసింగు ఎగ్జిబిషన్ సైడ్) తెరుప బడింది.



# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు



'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు–దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏ వైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,

సమాచార, పౌరసంబంధముల శాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైద్రాబాదు దక్కన్ — 1.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42,912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |

సగటు వర్షపాతం

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కొళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54.21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్రీ రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 47 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | ... రూ | 175.37 కోట్లు |

1958-59 బడ్జెట్టు :

| | | |
|---|---|---|
| ఆదాయం | ... రూ | 63.66 కోట్లు |
| వ్యయం | ... ,, | 62.87 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... ,, | 21.29 ,, |



యూనియన్ ఆర్థికశాఖా మంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ 19–7–58 న అజామాబాదు, హైదరాబాదులో చిన్న మొత్తాల పొదుపుకై లేబర్ కన్వెన్షన్‌ను ప్రారంభించారు.
ఆ సందర్భంలో సమావేశమైన వారిని చిత్రంలో చూడవచ్చు.